# Own a house or apartment at

Flats are available

# Seashells

## Atop Krupa Hills

## VISAKHAPATNAM

Rs 5 lakhs and above

## And get the best of both worlds

Visakhapatnam- City of Destiny, is one of the fastest growing cities in India today. With its Natural Port and increasing Industrial, Business and Trade Activities, it offers unlimited opportunities.

**Seashells**
Atop Krupa Hills

Green hills, golden beaches, cool sea breeze, swaying palms .. Believe it or not, we are not describing a holiday resort but an exclusive residential paradise called Seashells, located atop picturesque hills.

**YES! At SEASHELLS** it will be an investment in Peace & Prosperity.

**Seashells offers you these exceptional facilities:**

* Adequate guest car park
* Service shops
* Meditation Hall
* Maintenance Workshop
* Club House
* Swimming pool
* Children's Play Corner
* Tennis Court
* Jogging Track
* Landscaped green common plot with sitouts and walk arounds
* Dish Antenna
* Fire safety and fire fighting facilities
* Adequate water supply Tubewell and Municipal Water
* Gymnasium
* Creche
* Standby Generators for lift and other essential services



**2, 3 & 4 BED ROOM APARTMENTS & ROW HOUSES**

For more Information

**Ugesh & Madhav Builders (P) Ltd.**
11-2-1, Waltair Uplands, Visakhapatnam-530003
Phone 66264 Cable· KRUPA
Managing Director· **P.V. Ramaniah Raja**

Madras:
**RAJA RAMANIAH & CO**
1-C Century Plaza, 560, Anna Salai P B No 1488, Madras-600018
Phones. 457101, 454667, Telex 041-6998 RRCO IN
Fax (91) 44-458354 Cable KRUPA

Architects:
**Design Planning Services (P) Ltd**
Ahmedabad-380009.

**FINANCE AVAILABLE FROM VYSYA BANK, CANFIN HOMES, LIC, A.B.Homes & H.D.F.C.**

JAGATI Rs. 2-00 May 1992

37th Year of Publication

# జగతి

ఎడిటర్: చందూరం

430

మే - 1992

## సాహితీ సుధ

దిన మలినాంగుడైన హిమదీప్తియుం బ్రాయము దప్పు నాతియున్
వనరుహ శూన్యమౌ కొలను వర్ణితరూపు నిరక్షరాస్యమున్
ధనపరుడైన రాజు సతతంబును లేమిని గుందు సాధువున్
జనపతి చెంత దుర్జనుడు శల్యము లేడివి నా మనంబునన్

—భర్తృహరి

కరవీర రుచిర నూపురములు సెలువొంద - గాంచన పుష్ప మేఖలలు గట్టి
పున్నాగ మయ హారములు వెట్టి నవకర్ణి - కా శోభిత కటకములు వెలుగ
కేసర రాజీవ కేయూరములు దొడి - రాజీవ కర్ణపూరము లమర్చి
తిలకా భినుత హేమ తిలకంబు లుప్పొంగ - జంపన మాలికా సమితి దాల్చి
మధు లతాంతమయ మండన విమండిత - లైన కన్యకా చయంబు నడుమ
బొలిచె నద్రితనయ పుష్పిత జంగమ - లతల నడిమి కల్పలతయు బోలీ

— నన్నెచోడుని 'కుమార' సంభవం



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00- జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : గురుదేవ్ టాగూర్

# నిమ్మతొనలు

నాన్నా, నాకు అన్నీ నీ పోలికలే వచ్చాయని బామ్మ చెప్పింది' - అన్నాడు చిట్టి.

'నా పోలికలా - మీ మామయ్య పోలికలు అంటూ వుంటుంది అమ్మ ?'

'కాదు, నాన్నా - బామ్మ ఖచ్చితంగా చెప్పింది అన్నీ నీ పోలికలే నని.'

'సర్లే - ఎందులో ?'

'నీకూ చిన్నప్పుడు లెక్కల్లో సున్నాలే వచ్చేవట కదా !'

—యమ్ సోమశేఖర్
అమలాపురం

ఉదయం పది గంటలకు యల్ డిసిగా జాయినవటానికి వచ్చిన మాధవీలత కట్టూ బొట్టూ, రూపం అలంకారం చూసి గుటకలు వేయసాగాడు యుడిసి శేషావతారం.

గారెలకు వెన్న కాచిన నెయ్యి తోడైనట్లు, సెక్షన్ హెడ్ సుందరమూర్తి 'ఏమోయ్ శేషావతారం, ఆ అమ్మాయికి ఈ సెక్షన్ పనులు కొత్త - నాలుగు రోజులు ట్రయినింగ్ యివ్వు' - అన్నాడు. ఇంకేం ఆమె టేబుల్ ఎదురుగా కూచుని, ఫైల్సు ఎలా వ్రాయాలో చెబుతూ వీలుని బట్టి చేతులు తాకిస్తూ, టేబుల్ అడుగున కాళ్లు పొరబాటున తాకినట్లు తాకి, 'సారీ' అంటూ, 'ఫరవాలేదు, సార్' అని ఆమె అన్నప్పుడు ధైర్యం తెచ్చుకుంటూ, నాలుగైదు రోజులు ఆ విధంగా గడిపేసి, ఆదివారం సాయింత్రం బీచికి వెళ్దామని ఆహ్వానించాడు. ఆమె సరేనంది.

బీచిలో కూచున్నాక, శేషావతారం అన్నాడు : 'మీరు ఎంతో తెలివైన వారు - సూక్ష్మగ్రాహి.'

'నా తెలివి తేటలు ఎలా వున్నా, మీరు ఎంతో శ్రద్ధగా నేర్పారు.'

'మీరు ఏమీ అనుకోరుకద - ఒక మాట చెప్పాలని వుంది.'

'చెప్పండి'

'నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను.'

'నేనూ అదే అనుకున్నాను - నాకేమీ అభ్యంతరంలేదు. కంపాషనేట్ గ్రవుండ్స్ మీద నాకు ఈ జాబ్ యిచ్చారు - యిద్దరు పిల్లలు వున్నారు.'

—బిఆర్ మూర్తి
మచిలీపట్నం-2

ఏమండీ, మీకింత పేరు ప్రఖ్యాతులు వచ్చినా, మీ ఫోటో పత్రికలలో ప్రచురింప జేయరెందుకని ?'-అని

అడిగాడు పత్రికా విలేఖరి ప్రముఖ రచయిత అజ్ఞాతరావుని.

'నన్ను గుర్తు పట్టగల ప్రమాదం వుంది కదండీ - అందుకని ముందు జాగర్త' - అన్నాడు అజ్ఞాతరావు చిరునవ్వుతో.

'గుర్తు పట్టినంత మాత్రాన నష్టమేమిటి?' - అని పత్రికా విలేఖరి మళ్లీ ప్రశ్నించాడు.

'నా హీరోలకి మల్లే నేనూ అద్భుత సాహస కార్యాలు చేయగలనని పాఠకులు నన్ను వెంబడించి ఎదుర్కొంటే ....నేనసలే పిరికివాణ్ణి, బక్కవాణ్ణి.'

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

ఇది 'ఛైల్డ్ ప్రాడజీస్' కాలం. అన్ని రంగాలలోను 'ఛైల్డ్ ప్రాడజీస్' కనిపిస్తున్నారు. అష్టవర్ష ప్రాయంలోనే కవిత్వం వ్రాసి, ఆ కవితలని పుస్తకంగా అచ్చు వేయించిన ఉదంతాలు కూడా వినవస్తున్నాయి.

ఆరవ తరగతి చదువుతున్న రామనాథంగారి అబ్బాయి పవన్ కుమార్, తెలుగులోను, యింగ్లీషులోను కవిత్వం రాయడం మొదలెట్టాడు. 'మూఢ నమ్మకాలు' అని తెలుగులో ఒక కవిత, Rainy Day అని ఇంగ్లీషులో ఒక పద్యం, ఆ తర్వాత కోయిల, గులాబీ, చిలక యిలా తెలుగులో ఇరవై, ఇంగ్లీషులో పదిహేను పద్యాలు రాశాడు.

ఒకసారి తల్లి అడిగింది : 'కుమార్, నీవు ఎంతకీ 'సెలవులు,' Holidays మీద ఎక్కువగా రాస్తున్నావెందుకు?'

'మమ్మీ, ఏ విషయం మీదైనా నేను రాయగలను.'

కొడుకు మాటలలోని ఆత్మ విశ్వాసానికి, అహంభావానికి మధ్య గల రేఖ ఎంత సున్నితమైనదో తల్లికి తెలుసు.

'వేరు వేరు విషయాలు పరిశీలించి కాగితం మీద పెట్టాలి' అన్నదామె.

'హెడ్డింగులు మార్చేస్తే చాలు - కొత్తవనుకుంటారు.'

—పి కుసుమకుమారి
హైదరాబాదు-45

# పాఠకుల తీర్పు

శ్రీ చందూర్‌గారికి : నమస్సుమాంజలి. మొదటి పేజీ నుంచి చివరి పేజీదాకా చదివింపజేసే పత్రిక 'జగతి' - మీ 'డైరీ' అందులో హైలైట్. విశాఖలోని 'బిసిఐసి ఫంక్షన్ కళ్లకు కట్టినట్లు వ్రాశారు. నిజంగా మీ మధ్య నేను కూడా ఉన్నంతగా అనుభూతి పొందాను. ఇంత చక్కని భావన అందించిన మీకు నా ధన్యవాదాలు. 'రాట్న చక్రం' ఆ నాటి పరిస్థితులని చక్కగా విపులీకరిస్తోంది. నేటి తరానికి వాటి అవసరం ఎంతో ఉంది.

—ఇ దుర్గ
రాజమండ్రి-3

తెలుగు పత్రికారంగాన మాలతీ చందూర్ దంపతుల అపూర్వ సారస్వత సేవకు స్పందించిన, ఎప్పుడో సహస్ర మాస జీవులయియున్న మంచి రాజు సీతాపతిరావు (88) వృద్ధ దంపతులు ఆంగీరస యుగాది పండుగను పురస్కరించుకొని, 'జగతి' పత్రికకు పంపగలిగిన మూడు పద్యముల చిరుకాన్క.... ఆంధ్ర జగతి పతితలానంద మందగా.... ప్రగతి గనుచున్న 'జగతి'కి ప్రణతులివియె .... 'జగతి' చిరు పత్రికల కాదర్శమయి వెలుగు... లోకాసమస్తాస్సుఖినో భవంతు ఇట్లు - బుధజన విధేయుడు.

—ఎమ్ సీతాపతిరావు
వొమ్మంగి-533488

చందూర్‌గారికి ; నమస్కారములు. సీతానగరం గురించి దీక్షితులుగారి సోదరుని లేఖ చదివి యిది వ్రాస్తున్నాను. ఈ దీక్షితులుగారూ, డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారూ చాలా సన్నిహితులు. మా అమ్మకు, నాన్నగారికి వీరు బాగా తెలుసు. ఆ నాడు గూటాల గ్రామంలో మా యింటనే వీరి బస, అప్పటికి నేనింకా పుట్టలేదు ; ఆ త్యాగమూర్తులను చూసే భాగ్యం నాకు కలగలేదు.

—ఎ శేషు
దొండపర్తి, విశాఖ

శ్రీ చందూర్‌గారికి నమస్కారం. కొన్ని ఏళ్లగా మా యింట్లో అందరము మీ పత్రిక క్రమం తప్పకుండా చదువుతున్నాము. మీరు వ్రాసే భాష, చెప్పేతీరు, సైన్సు విషయాలు అందరికీ అర్థం అవ్వాలనే ప్రయత్నం అభినందనీయం. 'జగతి' జయప్రదంగా కొనసాగాలని ఆకాంక్షిస్తూ..

—రాజర్షి
మద్రాసు-17

# వెన్నెల కెరటాలు

## పద్మవిభూషణ్

ఇండియాలో 1964లో ప్రారంభమైన 'నేషనల్ డెమాన్‌స్ట్రేషన్ ప్రోగ్రాంలో స్వామినాథన్ నిర్వహించిన నాయకత్వ పాత్ర ఆయనకు ప్రపంచస్థాయి ప్రఖ్యాతి నార్జించి పెట్టింది. ఈ కార్యక్రమం క్రింద దేశంలోని పేదరైతుల భూములలో అధిక దిగుబడి నిచ్చే గోధుమ, వరి వంగడాలను నాటారు..... కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో పట్టా తీసుకున్న అనంతరం ఆయన 1952లో కేంబ్రిడ్జి యూనివర్శిటి నుంచి 'జెనెటిక్స్'లో పి. హెచ్.డి. పొందారు. ఆ తర్వాత స్వామినాథన్ మాడిసన్‌లోని విస్కాన్సిన్ యూనివర్సిటీలో రీసెర్చి అసోసియేట్‌గా పని చేశారు....1987లో ఆయన అమెరికాకు చెందిన 'జెనరల్‌ఫుడ్స్ ఫండ్ ఇన్ కార్పొరేటెడ్' నుంచి 2 లక్షల డాలర్ల నగదు బహుమతి పొందారు. స్వామినాథన్‌ని గౌరవ డి. ఎస్. సి. డిగ్రీలతో సత్కరించాయి.

—వ్యాస భాగం
'తెలుగు విద్యార్థి'

## రామోజీరావు

వివిధ వ్యవసాయ రంగాల్లో విశిష్ట సేవలు చేస్తూ ప్రజల మన్ననలను పొందిన ముగ్గురిని ఎన్నిక చేసి సన్మానించారు. కె.సి.పి. మేనేజింగ్ డైరక్టరు జగన్నాథరావు, వ్యవసాయదారుల మాసపత్రిక 'అన్నదాత' ప్రధాన సంపాదకులు రామోజీరావు. సహకార సంఘాల పటిష్టతకు పాటుపడుతున్న సమాఖ్య అధ్యక్షులు అలపాటి అప్పారావులను జనవరి 12న సన్మానించి బంగారు పతకాలను బహూకరించి గౌరవించడం హర్షణీయం. సాంకేతిక వ్యవసాయ పరిజ్ఞానాన్ని మాతృభాషలో, సులభశైలిలో రాష్ట్ర రైతులకు అందించాలనే ధ్యేయంతో ప్రారంభించిన 'అన్నదాత' మాసపత్రిక గత 23 సంవత్సరాల్లో వ్యవసాయదారుల తోడ్పాటుతో మన్ననలను పొందింది. 'అన్నదాత' పత్రికకు లభించిన యీ గౌరవపురస్కారం ప్రధాన సంపాదకులకే కాదు, తమ 'అన్నదాత'గా భావించి ప్రోత్సహిస్తున్న చదువరులందరిది.

—సంపాదకీయం
'అన్నదాత'

# పాతికేళ్ల నాటి పిక్చర్

కౌముది వారి

## కొంటె పిల్ల

సర్కస్, సర్కస్ మనుషులు, సర్కస్ జీవితం, సర్కస్‌లోని జంతు జాలం ప్రధానంగా ఏర్పరుచుకు, ఒక కోటీశ్వరుని కూతురు సూటూ బూటూతో యింట్లో నుంచి పారి పోవడం ప్రారంభ ఘట్టంగా తీసుకు, చివరి వరకూ సస్పెన్స్ కాపాడే చక్కటి చిత్ర కథ నల్లారు ఈ నిర్మాతలు. కథానాయకుడు యమ్‌జి రామ చంద్రన్ ; కథానాయిక బి సరోజాదేవి ....కొంటెపిల్ల (బి. స రో జా దే వి) యింట్లో నుంచి పారిపోతుంది. ఎందు కంటే, వెనక తన అక్కగారు కూడా యిదే విధంగా పారిపోయి, ఎక్కడో సర్కస్ కంపెనీలో చేరింది. తనకూ అటువంటి విపత్కర పరిస్థితి ఏర్పడ టంతో, అక్క నడిచిన బాట అనుసరి స్తుంది. తండ్రి మంచివాడే ! కాని, ఏం ప్రయోజనం ? సవతి తల్లికి, తను అంటేను, అక్క అంటేను గిట్టదు. అక్కని తన తమ్ముడి కిచ్చి కట్ట బెట్టాలని చూసింది సవతి తల్లి. అందుకనే అక్క యింట్లో నుంచి పారి పోయింది. ఇప్పుడు తనని అతని కిచ్చి పెళ్లి చేయాలనుకుంటోంది. అంచేత, తనూ పారిపోక తప్పదు. ఆ విధంగా పారిపోయిన కొంటె పిల్లని రవి (యమ్‌జిఆర్) ఒక టాక్సీ స్టాండులో చూసి, తమ యింటికి నేర్పుగా చేర్చి, ఆమె తండ్రికి టెలిఫోన్ చేస్తాడు వనితా జన మానస చోరుని లోని ధర్మనిరతి. అంత పటిష్టమైనది. ఈ అమ్మాయి తండ్రి, రవి తండ్రి చిన్ననాటి స్నేహితులవటంతో హీరో విలువ మరింత పెరుగుతుంది.... కొంటె పిల్లని కాపాడి, కుటుంబాన్ని నిలబెట్టే భారంనీది సుమా - అని రవికి తన కడపటి కోరిక తెలిపి, ఆ అమ్మాయి తండ్రి గుటుక్కుమంటాడు. ఈ రంగు రంగుల రామచిలకని కాపాడటం అనుకున్నంత తేలికవదు. సవతి తల్లి తమ్ముడైన డాక్టరూ, ఆస్తి వ్యవహారాలు చూసే వకీలూ, అక్క గారి భర్తా, ఒక వికృతాకారుడూ, కుటుంబ రక్షకుడినంటూ రవి — ఈ వలయం తప్పించుకు తుర్రున ఎగిరి పోతుంది ఆ రామచిలక. ఒక శార్దూలం, ఒక తోడేలూ, ఒక మార్జాలం, ఒక పెనుభూతం వెంటాడుతుంటాయి ఆ చిన్న చిలకని మింగేందుకు, ఈ సస్పెన్స్‌ని ఛేదించి రక్షకుడైన కథా నాయకుడు ఆమెని కాపాడుతాడు. కథలో సహజత్వం లేకపోయినా, పాత్రలలో ప టు త్వం ఉంది. నిర్మాత : యమ్మెస్ రెడ్డి.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జ గ తి' - మే - 1967

# మానవ ప్రగతి

3

## రేగన్ లైబ్రరీ

ఇటీవల జరిగిన రోనాల్డ్ రేగన్ గ్రంథాలయం మహోత్సవంలో, ప్రస్తుత అధ్యక్షుడు జార్జి బుష్, నలుగురు మాజీ అధ్యక్షులు - రేగన్, కార్టర్, ఫోర్డ్, నిక్సన్ పాల్గొన్నారు. అయిదుగురు అమెరికా అధ్యక్షులు ఇలా ఒకే వేదికమీద కలుసుకోవడం ఇది మొదటిసారి.... ఈ విశిష్ట కార్యక్రమంలో ఈ అయిదుగురి సతీమణులు కూడా పాల్గొనడం మరొక విశేషం. ప్రథమ మహిళ బార్బారా బుష్ ; ఇదివరకటి ప్రథమ మహిళలు నాన్సీ రేగన్, రోసలిండ్ కార్టర్, బెట్టీ ఫోర్డ్, పాట్ నిక్సన్‌తో పాటుగా శ్రీమతి లిండన్ జాన్సన్, మరికొందరు కూడా పాల్గొన్నారు.... అంకిత మహోత్సవంలో ప్రసంగిస్తూ రేగన్‌ని ఒక దార్శనికునిగా, ఒక యోధునిగా, ఒక రాజకీయ ప్రవక్తగా అమెరికన్ వ్యక్తిత్వానికి ప్రతీకగా అభివర్ణించారు బుష్, 'కమ్యూనిజం' గురించి రేగన్ అంచనా నిజమని ఇప్పుడు చరిత్ర రుజువుచేసింది. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ తర్వాత ప్రపంచాన్ని స్వాతంత్ర్య ప్రభావ భరితంగా మాటలను వినియోగించిన రేగన్ మాత్రమే నన్నారు బుష్. 80 ఏళ్ల రేగన్.... తన పేరిట ఏర్పడిన గ్రంథాలయం .... పండితులు భవిష్యత్తుని తరచి చూసేందుకు ఉపకరించే ఒక చైతన్య వేదిక కావాలన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.... రేగన్, అమెరికా సైనిక శక్తిని పునరుద్ధరించారని, ఆ సైనిక శక్తితోనే అద్భుత వ్యూహాన్ని అమలు జరిపి గల్ఫ్ యుద్ధంలో బుష్ విజయం సాధించారనీ పేర్కొన్నారు నిక్సన్ రేగన్, అమెరికన్ ప్రజల అకుంఠిత విశ్వాసాలను, అత్యున్నతమైన ఆశలను నెరవేర్చిన జాతీయ నాయకుడని చెప్పారు ఫోర్డ్.... రేగన్ సారథ్యంలో అమెరికా పటిష్ఠంగా, స్థిర సంకల్పంతో నిలచి ప్రచ్ఛన్న యుద్ధ పరిసమాప్తికి శ్రీకారం చుట్టగలిగిందనీ ప్రపంచ ప్రజానీకానికి మనదేశం తన గొప్పదనాన్ని మరొకసారి చాటి చెప్పగల అవకాశాన్ని కలుగజేసిందనీ పేర్కొన్నారు కార్టర్. 6 కోట్ల డాలర్ల విలువైన రేగన్ లైబ్రరీ సముదాయం లాస్ ఏంజలిస్‌కి 35 మైళ్ల దూరంలోని వెంచురా కౌంటీలో ఒక కొండ

మీద 30 ఎకరాల స్థలంలో ఏర్పాటు చేశారు. అమెరికాలోని 10 అధ్యక్ష గ్రంథాలయాలలో కెల్లా అతి పెద్దదైన రేగన్ గ్రంథాలయాన్ని ప్రయివేట్ విరాళాలతో నెలకొల్పారు. ఏటా కోటిన్నర డాలర్ల బడ్జెట్‌తో ఈ లైబ్రరీని జాతీయ 'ఆర్క్‌యివ్స్, రికార్డ్ అడ్మినిస్ట్రేషన్' నిర్వహిస్తుంది. 1940, 1950 ప్రాంతాలలో చలన చిత్ర నటునిగా రేగన్ గడిపిన జీవితాన్ని కూడా ఇక్కడి మ్యూజియమ్ ప్రతిబింబిస్తుంది. ఆర్థిక విధానాల మీద రేగన్ చేసిన ప్రసంగాల వీడియో చిత్రాలు, 1981లో రేగన్ మీద జరిగిన హత్యా ప్రయత్నానికి సంబంధించిన వీడియో క్లిప్పింగ్స్ కూడా ఇక్కడ వున్నాయి. కమ్యూనిజమ్‌ని ఓడించడానికి రేగన్ జరిపిన కృషి ఇక్కడి మ్యూజియమ్‌లో ప్రధానాంశం..... (అమెరికా సమాచార శాఖ.

## ఇన్‌సాట్

ఉపగ్రహ సాంకేతిక విజ్ఞానంలో భారతదేశం పరిణతి చెందింది. ఐ.ఆర్.ఎస్ - ఎ, బి, ఇన్‌సాట్-2 ఉపగ్రహాలను విజయవంతంగా నిర్మించి ప్రయోగించటమే ఇందుకు నిదర్శనం. నేడు సమాచార, ప్రసార, వాతావరణ, ప్రకృతివనరుల యాజమాన్యం మొదలైన రంగాలు ఉపగ్రహ పరిజ్ఞానాన్ని వినియోగించుకుంటున్నాయి.... ఇన్‌సాట్-1-బి ని 1983లో విజయవంతంగా ప్రయోగించడంతో, దేశంలో ఇన్‌సాట్ వ్యవస్థ వల్ల సమాచార విప్లవం వచ్చింది. ప్రస్తుతం సమాచార, ప్రసార రంగాలు, జూన్ 1990లో ప్రయోగించిన ఇన్‌సాట్-1-డి ఉపగ్రహాన్ని ఉపయోగించుకొంటున్నాయి. ఇందులో 123 టెలికమ్యూనికేషన్ల టర్మినల్స్‌తో 137 మార్గాలు 5000 సంభాషణ పర్యాయ్యట్లు ఉన్నాయి. ఇన్‌సాట్ ఉపగ్రహం సహాయంతో దేశంలోని మారుమూల ప్రదేశాలకు, సముద్రాలలో ఉన్న దీవులకు సమాచారం సులభంగా అందుతోంది. వార్తా రంగానికి త్వరగా ఫోటోలను వార్తలను, వాణిజ్య రంగంలో సమాచారం పంపటానికి ఉపగ్రహ వ్యవస్థ వాడకం మామూలు విషయమయి పోయింది. ఇన్‌సాట్ ఉపగ్రహం ప్రతి అరగంటకు పంపే చిత్రాల సహాయంతో ఎప్పటికప్పుడు వాతావరణ పరిస్థితులను ముందుగా అంచనా వేయగలుగుతున్నాం. తుఫానుకు గురయ్యే తూర్పుతీర ప్రాంతాల్లో నెలకొల్పిన 100 ప్రమాద హెచ్చరిక కేంద్రాలు రానున్న తుఫాను గురించి ముందుగా హెచ్చరించడం ద్వారా అనేకమంది ప్రాణాలను కాపాడటానికి వీలయింది.... ఇన్‌సాట్ వ్యవస్థ ఉపయోగాల్లో ప్రముఖమయింది, దేశంలోని మారుమూల ప్రాంతాలకు దూరదర్శన్ సేవలు విస్తరించడం. నేడు దేశంలో 75 శాతం మంది ప్రజలకు దూరదర్శన్ కార్యక్రమాలు అందుబాటులో ఉన్నాయి. మన దేశం

కేవలం ఉపగ్రహాల తయారీలోనే కాక, ఉపగ్రహాలను కక్ష్యలో ప్రవేశ పెట్టడానికి కావలసిన రాకెట్ టెక్నాల జీని కూడా దేశీయంగా రూపొందించు కొంటోంది. ఈ దిశలో మనం రోహిణి ఉపగ్రహాన్ని ప్రవేశ పెట్ట టానికి రూపొందించిన రా కె ట్ టెక్నాలజీకి మార్పులు చేర్పులు చేసి, 1992 ఏప్రిల్ నాటికి "అగు మెంటెడ్ శాటిలైట్ లాంచ్ వెహికల్‌ను" ప్రయోగించనున్నారు. అలానే 1000 కిలోల బరువు గల ఐ. ఆర్. ఎస్. రకాల ఉపగ్రహాలను కక్ష్యలో ప్రవేశపెట్టడానికి "పోలార్ శాటిలైట్ లాంచ్ వెహికల్‌ను" తయారు చేస్తున్నారు. ఇంకను, 2500 కిలోల బరువు కలిగిన ఇన్‌సాట్ తరహా ఉప గ్రహాలను "జియోసిన్ క్రోనస్" కక్ష్యలో ప్రవేశపెట్టడానికి కూడా రాకెట్ టెక్నాలజీని మన దేశం తయారుచేసుకోనున్నది..... (ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

## మొదటి ప్రయోగం

గాంధీజీ దక్షిణ ఆఫ్రికాకు లాయర్‌గా ఒక కేసు పనిమీద 1893లో వెళ్లారు. అప్పుడు దక్షిణ ఆఫ్రికాలో నాలుగు కాలనీస్ ఉండేవి. నటల్, కేప్, ట్రాన్స్‌వాల్, ఆరంజ్ ఫ్రీస్టేట్ - యూరోపియన్‌ల ప్రభుత్వం ఉండేది అచట. గాంధీజీ దక్షిణ ఆఫ్రికాలో మొదట ప్రిటోరియాలో తర్వాత నటల్‌లో ఉండేవారు. అక్కడ వున్న భారతీయుల సమస్యల మీద తరచూ పత్రికలకు రాస్తుండే వారు. అక్కడి బ్రిటీష్ ప్రభుత్వం ఆజ్ఞలలో పనిచేసేందుకు ఇండియా నుండి పనివారిని ఆఫ్రికాకు పంపడం 1860 సంవత్సరంలో మొదలయింది .... క్రమంగా భారతీయ వ్యాపారస్తులు ఆఫ్రికాకు రావడం మొదలు పెట్టారు. గాంధీజీ కొన్ని చేదు అనుభవాలు రుచిచూచిన తర్వాత అక్కడి ప్రజలపై తెల్లవారు చూపుతున్న వివక్షతను ప్రతిఘటిస్తూ పిటిషన్‌లు రాయించి ప్రజలను ఉత్తేజితులను చేస్తూ అక్కడ ఉన్న భారతీయుల ఓటు హక్కును నిర్మూలించే బిల్లుకు వ్యతిరేక ఉద్యమం మొదలెట్టారు. అదే ఆయన రాజకీయ జీవితానికి నాంది. ఇలా అక్కడి ప్రజలు ఆయనను 21 సంవత్సరాలు 1914 వరకూ దక్షిణ ఆఫ్రికాలోనే తమ నాయకుడిగా ఉంచేశారు. గాంధీజీ తదితరులతో బహిరంగ లేఖ వ్రాసి అన్ని పేపర్లలోనూ ప్రచురించారు. అక్కడి భారతీయులు ప్రతిస్పందిస్తూ తమ పరిస్థితిపై తరచూ పత్రికలకు లేఖలు రావడం మొదలయ్యింది. దక్షిణ ఆఫ్రికాలోని సారవంతమయిన నేలల్లో ఎన్నో ఫలాల తోటలు, పంటలు సమృద్ధిగా పండే అవకాశం ఉన్నా, అక్కడి యూరోపియన్‌లు మాంసాహారులగుటవల్ల భారతీయులు కొందరు మాత్రం వ్యవసాయం చేస్తుండేవారు. బంగారు గనులే జీవనాధారం.... (సర్వోదయా ప్రెస్ సర్వీస్)

?

"I wonder how Vibheeshana could be different from the other two brothers. They all were brought up by the same mother in the same surroundings," said Raghu.

"Don't we find such differences even today ? Even the mother herself cannot explain such basic variations. You should remember that Ravana and Kumbha Karna are symolic of *Rajas and Thamo Gunas* while Vibheeshana is of *Satva,*" replied Raghu's Father.

"You mean to suggest that Valmiki has carved out the characters in such a manner as to portray those qualities ? questioned Raghu.

"The emphasis, of course, is on a particular Guna. Ravana was so proud, self-centred, egoistic, domineering that he could not for a moment think of the ultimate consequence of his misdeeds and Kumbha Karna was a docile. thoughtless, stupid brother. Just like Vibheeshana in *Treta Yuga,* you find Prahlada, the son of Hiranya Kasipu in *Krita Yuga.* After all they are Jaya - Vijayas taking different *Janmas* for their sin of insulting Sanaka-Sanandanas. *Yuga Dharma* moulds the character and the triumph of *Satva* over the other two is narrated in graphic detail," said Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నచక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారొకరు.... వారి జీవిత గాథలోని సంక్షిప్త భాగాలివి.

ఆశ్రమంలో కొన్ని చేతి పరిశ్రమలు నెలకొల్పబడి బాలురకు శిక్షణ ఈయబడేది - బట్టల నేత, నూనె గానుగు, చర్మ పరిశ్రమ, పాద రక్షల తయారు. ఉన్న యకరంలోనే కూరగాయల, పండ్ల, పువ్వుల పెంపకం ఉండేది. కార్యకర్తలం ముగ్గురం కుటుంబాలతో సహా ఆశ్రమ ఖర్చుతో గృహవసతు లేర్పరచుకొని ఆశ్రమావరణలోనే నివాసం. ఆశ్రమంలో నా కుండినవి ముఖ్యముగా రెండో మూడో పనులు : (1) విద్యార్థులను కలుపుకొని నూతి నీరు తోడి తోటకు పోయడం (2) ఆశ్రమానికి చేరి యున్న వేరొకరి మామిడితోటలో కూర్చుని ఆశ్రమ బాలురకు పుస్తక విద్య గఱపడం (3) సాముహిక సూత్ర యజ్ఞం. పరిసర వ్యవసాయ క్షేత్రాల రైతులందరు ఆశ్రమాభివృద్ధిని కోరే మిత్రులై యుండిరి - ఆ కాలంలో ఏటేటా పంటలు మార్చి పండించేవారు. భూమి బహుఫలవంతమైనది. ఆ ప్రాంతమంతా నూతినీటి ఆధారంగా ఫలించే మెట్టభూమి. ఒక సంవత్సరం అయిదు దినుసులు విత్తనాలు కలిపి చల్లేవారు. కుంచెడు (అనుకుందాం) మెట్టవరి (బుడమ) విత్తనాలలో నాలుగోవంతు 'కంది విత్తనాలు, యింకా తక్కువ ప్రత్తి గింజలు, అంతకంటెను తక్కువగా గోగు, జనప గింజలు కలిపి ఒకేసారి గుప్పెళ్లతో వెదజల్లేవారు. పరిధాన్యం

మూడునెలలో చేతికి వస్తుంది. వరి కోత తరువాత కంది మొక్కలు విజృంభించి డిసంబరు నాటికి ఫలి స్తాయి. ప్రత్తిచెట్లు కూడా క్రమంగా పెద్దవై మేనెల వరకు ప్రత్తి విడుస్తూనే ఉంటాయి. ఈలోగా గోగు, జనప మొక్కలు నిడువుగా పెరిగి, వేళ్ళతో సహా పీకి వేయబడి చిన్న చిన్న కట్టలుగా నీటి గుంటల్లో ఊరబెట్ట బడతాయి. కొన్నాళ్ళయిన తరువాత వాటి నుండి మంచిరకం తెల్లని నార వస్తుంది. శుభ్రమైన ప్రత్తి జాగ్రత పెట్టుకొనటానికి మేమే రైతు అంగీ కారంతో పొలంలో ప్రవేశించి, ఖరీదిచ్చి ప్రత్తి కోసుకొనే వాళ్ళం. ప్రత్తితూకంలో 3/4 వంతు గింజ లుండేవి. దానిని ఆ రైతు తాలూకు స్త్రీలకిస్తే వారు ప్రత్తి గింజలను మాత్రం కూలిగా తీసుకొని దూది మాకిచ్చేసే వారు. దానిని ప్రక్క నున్న చంద్రవర నివాసి, ముస్లిం అబ్దుల్ రషీద్ చేత ఏకులు చేయించు వునే వాళ్ళం. వీసెడు ఏకులకి కూలిగా కొన్ని అణాలు మాత్రమే అతడు తీసు కొనేవాడు. ఆశ్రమం ప్రక్కనున్న ఏటిలో (రాళ్ళమడుగు) బల్లకట్టు (Ferry Boat) నడిపేవాడు కూడ రషీదే. బల్లకట్టు పనిని గూర్చి ఇన్ని తబ్సిళ్ళు ఎందుకు చేరుస్తున్నానంటే, For the simple and innocent pleasure that there is in life itself అనండి లేదా ఈ జీవిత కథకు ఒక రకమైన రంగు తేల్చటాని కనండి, కుటుంబాలతో సహా ఆశ్రమ నివాసులు కలిసి వడికే నూలును వస్త్రంగా తయారు చేయటానికి మల్ల వరం హరిజన నేత పనివాడు సిద్ధంగా ఉండేవాడు.

మాలో యిద్దరి తల్లులు 70 యేండ్లు దాటిన రాజమ్మా, యశో దమ్మలు అస్పృశ్యతను పూర్తిగ విడనాడి మాతో పాటు విధిగా సూత్ర యజ్ఞం చేసేవారు. 25 ఏండ్ల నా భార్యతో పాటు వారిద్దరు - ముగ్గురూ కలిసి ఆశ్రమంలోనే తమ విదేశీ వస్త్రాలన్నిటిని తగుల బెట్టారు. నేను జైళ్ళలో నున్నపుడు నా భార్య వెంకాయమ్మ దగ్గర గ్రామాల్లో ఖద్దరు అమ్మకం తన పనిగా చేసుకుంది. ఆ కాలంలో మాలవారి మగ్గాలు ప్రశస్తి పొందాయి. మాలల చేత పొలం సేవా, గ్రామ సేవా, ఇంటి సేవ యావత్తూ చేయించుకొంటూ అంట రానితనం ఎట్లా సమర్థింప బడేదో బోధపడని విషయం. సంఘ భయం నిష్కారణ దురాచారం, సాగివస్తోన్న దుర్జనత్వం అది. కొందరు ఆశ్రమ బాలురు బట్టల నేత నేర్చుకొన్న తరు వాత ఆశ్రమ మగ్గం మీదనే వస్త్రాలు తయారయ్యేవి. ఆశ్రమంలో పెంకుటి భవనం స్వంత ఖర్చుతో నిర్మింపజేసిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు ఆశ్రమా విష్కరణోత్సవానికి కొవ్వూరులో మెయిలు బండి దిగి, మూడు మైళ్ళు వెనుకకు నడిచి ఆశ్రమానికి వచ్చారు. ఆశ్రమ నిర్మాణం 1924లో కాబోలు జరిగింది. మొదటి రకం

జాతీయ వాది, త్యాగనిధి, నిర్భయుడు, నిష్కామశీలి అగు శ్రీ కనకదండి సోమయాజులుగారి శ్రమదానం ఈ ఆశ్రమ భవన నిర్మాణమని చెప్పాలి. ఆయనవొక్కడూ ఆ నిర్జన ప్రదేశంలో నివాసం చేసి, ఆ పని పూర్తిచేసి ఆ తరువాత ఎప్పుడో ఉత్తర హిందూస్థానంలో స్థిరపడి, సింధునది పుట్టిన చోటువరకు వెళ్ళి (తత్పూర్వం సరిగా ఆచోటు గుర్తించినవారే లేరట!) ఏ మానవుడూ చేసియుండని మహత్కార్యం నెరవేర్చాడు తరువాత 'ప్రణవానంద'డైన ఈ సోమయాజులు. ఈ discovery మీద శ్రీ ప్రణవానంద ఒక పుస్తకం వ్రాశారు. దానిని కలకత్తా విశ్వవిద్యాలయం ప్రచురించింది. ఆశ్రమావిష్కరణ రోజున ఏలనో నేనచ్చట హాజరుగా లేను. 'విశ్వదాత' నాగేశ్వరరావుగారి అనేక దాతృత్వాలలో ఈ భవన నిర్మాణం ఒకటి. 1921-23 నాటి గాంధీ జాతీయ పాఠశాల, ఈ ఆనందనికేతన హరిజనాశ్రమ సేవా - రెండూ గాంధీ సేవా నిలయాలైనా చాల విషయాలలో దానికీ దీనికీ పోలికలున్నా, జాతీయ పాఠశాలాధ్యాప



కత్వం దానికేర్పడిన ఒక కమిటీ అధ్వర్యాన మూడేండ్లపాటు నేను చేసిన పని; ఇదట్లాకాదు. మూడు కుటుంబాలు కలసి చేసిన సహజీవన స్వచ్ఛంద స్వామి కార్యమిది. ఇందు నరసింహశర్మగారి సతీమణి శ్రీమతి విశ్వసుందరమ్మగారు ఇంగ్లీషు భాష రాని సహజ పండితురాలు, కవయిత్రి. కోరుకొని గాంధీ జాతీయోద్యమంలో నిర్భయంగా జైలుకు వెళ్ళిన మనిషి. జైలుకు వెడుతూ మేజిస్ట్రేటు ముందు ఆమె యిచ్చిన వాఙ్మూలం సత్యాగ్రహులందరు చదువుకో వలసింది. గాంధీ యుద్యమం నుండే ఆమె కాధైర్యస్థయిర్యాలు అధికాధికంగా అబ్బాయి. ఆశ్రమ బాలురకు విశ్వసుందరమ్మగారు పేర్లు మార్చి కొత్త పెర్లు పెట్టారు. గంగన్నకు విష్ణు అని, చింతన్నకు చిత్తరంజన్ అని, చిన్నయ్యకు మోహన్‌దాసు అని పేర్లు మార్చారు. ఆశ్రమ బాలురందరిలో విష్ణునాముడొక్కడే ఇంగ్లీషు పరిచయం ఎక్కువగా లేకపోయినా హిందీ, తెలుగు భాషల్లో ప్రవీణుడై, ఢిల్లీ 'హరిజన నివాసం'లో అధ్యాపకుడై, ఆ సంస్థ అసిస్టెంటు మేనేజరై యిపుడు రిటైరయి, అక్కడి కేంద్ర హరిజన సేవాసంఘ నివాసియై యున్నాడు. ఆ నాటి స్వాతంత్ర్య సమర యోధుల్లో యితడొక్కడు. పత్రికలకు ధర్మసంబంధమైన వ్యాసాలు వ్రాస్తుంటాడు. అనాటి 'ఆనందనికేత' నాశ్రమ నిర్వాహకులలో ఒకడను, ముఖ్యాధ్యాపకుడను అగు నా కిప్పటికి తరుచు ఆదరణీయులగు 'గురుదేవులకు' అనే సంబోధనతో ఉత్తరాలు వ్రాస్తుంటాడు. అవి నాకు అత్యంత ప్రియమైన స్వాగత పత్రాలు. మానవుని ఆధ్యాత్మికోన్నతికి పనికివచ్చేవి తప్ప చెత్త వ్రాత లతనికి భర్జించవు. గాంధీ వినోబాలు, వారి అనుయాయులు గురుదయాల్ మల్లిక్ వంటి దేశోద్ధారకులు మా విష్ణుకు జీవితా దర్శం. ఢిల్లీలో కావలసిన వాళ్ళెవరూ లేక పోయినా అదే అతని కాణాచి (అచ్చివచ్చిన స్థలం) అయింది. నాతో అతని చిన్నతనం నుండీ యేర్పడియున్న ఆత్మీయతను గూర్చి ఈ మాత్రమైనా చెప్ప కుండా ఉండలేను.... ఆశ్రమంలోని చిన్న పిల్లలకు మాతోపాటు విశ్వసుందరమ్మగారు కూడ కొన్ని పాఠాలు చెప్పేవారని నా జ్ఞాపకం. వారణాసి శేషయ్య అనే అర్చకుడు ఆశ్రమ జీవితాన్ని వరించి, మాతోపాటు ఆశ్రమనివాసియై యుండేవాడు. అతడు కూడ ఆశ్రమబాలురకు పాఠాలు చెప్పేవాడు. అడకువ, అమాయకత్వం అతని శీలసంపదయని చెప్పాలి. కొంతకాలం తరువాత అతడు ఆశ్రమంలోనే దివంగతుగడైనాడు. ప్రక్కనున్న యేటియొడ్డుకు మోసుకొనిపోయి నీటి యంచున ఉచితమగు ప్రేమ గౌరవాలతో దహనక్రియ జరిపాము. ఈ శేషయాఖ్యుడు ఎవరంటే, 1921–23ల్లో రాజమహేంద్రవర గాంధీ జాతీయ పాఠశాలలో నాతో పాటు అధ్యాపకత్వం నెఱపి, పాఠ

శాలలోని అందరి పూజ్యతను గడించిన శ్రీయుత గరికిపాటి సూర్యప్రకాశరావు గారి బావమరది (భార్యసోదరుడు) అని నా జ్ఞాపకం. ఆయనయే బావమరిదిని మా వద్దకు పంపారు.

ఐదు విత్తనాలు, అంటే వరి, కంది, ప్రత్తి, గోగు, జనుము సంవత్సర పంట అయిపోగా, మరుపటి సంవత్సరం పైరు మార్చి, పైరు నువ్వు, అది కోసి జొన్న చల్లుతారు. ఇదే విధంగా కొన్ని జిల్లాలలో జొన్నతో కలిసి పెసర, లేక మినుము, లేక బొబ్బర, లేక ఉలవ, చల్లుతారు. పని ఒక్కటైనా ఫలితం పదిరెట్లు. కర్షకుని జీవితం ఈ విధంగా హాయిగా కడతేరుతుంది. ఇది అప్పటి నా కండ్ల ఎదుటి దృశ్యం. మనిషికి సంపూర్ణ జీవనాధారమైన ఈ ఆహారపు economy ఆశ్రమం చుట్టూ కన్నుల పండువుగా చూచి యుండటమే ఒక భాగ్యంగా భావించేవాడను.

1929 వేసవిలో ఆంధ్రదేశ పర్యటనలో ఒక రాత్రి గాంధీ మహాత్ముని మకాం మా ఆనంద నికేతనాశ్రమంలో ఏర్పాటు చేశారు. ఆంధ్ర నాయకులందరూ ఆ రాత్రి ఆయనతో

ఆశ్రమంలో మకాం. వారితో మరి ఇతరు లెందరో కూడ వచ్చారు. వీరందరికీ ఆశ్రమంలో వంట చేయ నీయలేదు, ఆశ్రమానికి యకరం పొలం విరాళ మిచ్చిన మల్లవరం రైతులు ముగ్గురు, గంగరాజు అన్న దమ్ములు. భక్ష్యాలన్నీ వారే తయారు చేయించారు. ఆ మల్లవరం వారు, మేము కలసి వేసవికాలపు మోకాటి లోతు ఏరుదాటి వంటకాలను ఆశ్రమా నికి చేరవేశాం. మహాత్ముడు, తతిమ్మా పరివారమందదూ సాయంకాలం 6 గంటలకు ఆశ్రమానికి చేరారు. సాయం కాలం ప్రార్థనలో నేను, విశ్వసుంద రమ్మగారు కలిసి తెలుగు కీర్తనలు పాడాము. అందులో అదేమిటి, ఇదేమిటి అని మహాత్ముడు కుశల ప్రశ్నలడిగాడు. మహాత్మునికి ఆశ్రమ భవనం బయట పడక ఏర్పాటయింది. ఒక పట్టిమంచం, దానిపైన ఖద్దరు పరుపు వేశారు, కొంతసేపు వారూ వీరూ మహాత్ముడిని ప్రశ్నలడగటం, ఆయన జవాబులు చెప్పటం జరిగింది. నా జ్ఞాపకమేమంటే నేను కూడ దగ్గర నున్నానే కాని, ఆ సంభాషణలో కొంచెం కూడ పాల్గొనలేదు. నేనే మిటి, మహాత్మునితో సంభాషించటా మేమిటి అని. ఆయనను అడిగి తెలుసు కోవలసింది నాకేమీ కనబడలేదు కూడ. ఆ రాత్రే మా ముదుసలి తల్లి ఒక వందరూపాయిలు వెండిగిన్నెలో పోసి ఆయన కర్పించింది. తెల్లవారు జామున ఆయనతో పాటు అందరూ నిద్ర లేచారు. ఒక ప్రశ్న ఎవరో అడి గారు ఆశ్రమం చుట్టూ తాటిచెట్లుం డేవి. "అక్కడికక్కడే ఆ చెట్ల క్రిందనే కూర్చుని కల్లు తాగుతుం టారు తాగుబోతులు, ఏమి చేయ మంటారు ?" అని అడిగారు. 'Take police aid and suppress it' అన్నారాయన. మర్నాడుదయం వెళ్ళ బోయేముందు ఆశ్రమవిద్యార్థి చిగురు పాటి భీమయ్య ఒక ఖద్దరు జంపుకానా, తాను నేసింది మడతపెట్టి మహాత్ముని చేత బెటాడు. విప్పిచూచి, నేత బాగున్నదని గాంధీ మెచ్చుకున్నారు. అటనుండి గాంధీ ప్రయణం సీతా నగరం ఆశ్రమానికి. నేను ఆయనతో సంభాషించక పోయినా, ఆ మూర్తిని వదలలేక నేను కూడ సీతానగరం వెళ్ళి, ఆయన అక్కడ మకాం చేసినంత సేపూ (ఒకరోజు కాబోలు) ఆయన కార్యక్రమం తిలకిస్తూ అక్కడనే ఉండి, మా ఆశ్రమానికి తిరిగి వచ్చే శాను. సీతానగరం మకాంలో, గాంధీని ఒక్కవాక్యంలో వర్ణించమని పట్టాభి సీతారామయ్యగారిని ఎవరో అడిగారు. 'His is a mighty intellect with a mightier heart' అని ఒకే వాక్యంలో ఆయన వెంటనే జవాబు చెప్పారు. మా ఆశ్రమ నివాస కాలంలో అందరి పనీ రాట్నం మీద నూలు వడకటం, ఉన్నయకరంలోనే intensive తోటపని. ఆ స్థలంలోని, మొక్కలన్నీ నేను పాతినవే స్థలం చుట్టూ. సీతాఫలం ముఖ్యం – ఒక చోట ఆకాశమల్లి (cork tree), వేరొక మూల సీమ బాదం, మరేవో

ఆశ్రమం చాల ఏళ్ళు నడించింది. 1930లో కొందరు విద్యార్థులతో సహా శాసనోల్లంఘనం చేసి మేము జైళ్ళకు వెళ్ళాం. తరువాత మళ్ళీ కొంత కాలం అది వేరొక రూపంలో నడిచింది. నేనప్పుడు లేను. హరిజన బాలురూ లేరు.

## 4

నాకు ఒక సంవత్సరం కఠిన జైలు శిక్ష వేశారు. ఆకాలంలో రాజమండ్రి సెంట్రల్ జైలు పరిపాలనంతా అవినీతిమయం. నన్నెరిగిన డివిజనల్ మేజస్ట్రేటు మంత్రిప్రగడ నరసింహం గారు నాకిచ్చినది 'B' క్లాసు ఖైదు. ప్రభుత్వానికి రెండుసార్లు అర్జీ పెట్టి దానిని 'C' క్లాసుకి మార్చుకోగలిగాను. నాకు C. క్లాసు ఆర్డరు గవర్నమెంటునుండి రాకుండానే, నా మీద కోపంతో, తాత్కాలికంగా నన్ను C క్లాసులో వేయించాడు జైలుసూపరెంటు తెల్లవాడు, Mr. Upsan. అతడు బహు కోపిష్ఠి. నీచకృత్యాలు చేయడానికే మాత్రం జంకడు మా కోసం వండబడ్డ అన్నపు రేషన్ ముద్దలు చోడి, జొన్నఅచ్చులు. ఉదయం మాకిచ్చే మూడురకాల గంజినీళ్లు సూపరెంటు యింటివద్ద కోళ్లకు, బాతులకు, పందులకు ఆహారంగా జైలు జవాన్‌లను బంపి తీసుకొని పోయేవాడు. జైలు కిచన్ పర్యవేక్షకుడుగా C క్లాసు ఖైదీలకోరికపైన నేను ఏర్పాటయినాను. ఖైదీల తిండికి ఉపయోగ పడవలసిన గోంగూర, తోటకూరలతో పాటు సగానికి సగం పచ్చిగడ్డి కూడ కోయబడి, యేక మోపులుగా కిచన్‌లో వచ్చిపడేది. గడ్డి యేరివేసుకునే పని నాది, నాతో మరి యిద్దరు సత్యాగ్రహులది. వంట పని మామూలు ఖైదీలు కొందరు చేసేవారు. మా పులుసు తాళింపు[illegible] ఈయబడే సీసాడు నూనెలో సగభాగం దొంగిలించి, కిచెన్ వార్డరు తన యింటి కెత్తుకొని పోయేవాడు. ఈ చోరీలను నేను అటకాయించి, సూపరెంటుకు శత్రువునైనాను. సూపరెంటు యూరోపియన్‌భార్య గయ్యాళి, దొంగఘుటం. ఆమె పరంగానే ఈ నీచకార్యాలు జరిగేవి. మరియే జైల్లోను యిటువంటి దారుణ కృత్యాలున్నట్లు నేను వినియుండలేదు, చూచియుండలేదు. నేనేం జేసేదమ్మా, కిచెన్‌లో కాంగ్రెసోడొక డున్నాడు అన్నాడట కిచన్ ముసలి వార్డరు, సూపరెంటు భార్యతో. 'ఆ కాంగ్రెసు వాడ్ని నా వద్దకు తీసికొనిరా' అన్నదట దొరసాని. ఎంత ఒళ్లెరుగని గర్వపోతో! 'అమ్మగారు నిన్ను తీసుకొని రమ్మన్నారు' అన్నాడు వార్డరు, నా వద్దకు వచ్చి. నా కాశ్చర్యమయింది. 'మరి తీసుకువెడతావా?' అన్నాను. నన్ను వెంట బెట్టుకొని ఔటర్ మైన్ గేట్ కూడ తెరిపించాడు. ఏమవుతుందో చూతామని నేనూ బైటకు వెళ్ళాను. అక్కడ కూర్చొన్న కొందరు వార్డర్లు వాడిని చివాట్లు పెట్టి మళ్ళీ నన్ను లోపలికి పంపివేశారు. వాడికి ఏడుపు పర్యంతం

అయింది. ఒకనాడు ఈ ఆహార పదార్థాల చోరీని గూర్చి సూపరెంటుతోనే ఫిర్యాదు చేశాను. తనకేమి తెలియనట్లు నాకు జవాబిచ్చాడు. కానీ అతనికి తెలియకుండ ఏ పనీ జరుగదు. ఒక్కొక్కనాడు సూపరెంటు ఇంటి వార్డరు వచ్చి అమాంతంగా జైలు వంట హొయ్యిలో నుండి కొరకంచులు లాగి, బొగ్గులు దులుపుకొని పోయెవాడు. ఇంకేం చెప్పుకోవాలి ? చెబితే ఇట్టివెన్నో ఉన్నాయి.

నాతో పడలేక నన్ను 'B' క్లాసుతోనే కలిపి రాయవెల్లూరు జైలుకు బదిలీ చేశాడు. అక్కడకి వచ్చింది నా 'C' క్లాసు అనుమతి పత్రం. His 'B' class is confirmed, but if the prisoner wants to go into a lower class, he can do so at his own option - అని ఉంది అందులో. నన్ను పిలిచి అడిగాడు సూపరెంటు మేజర్ ఖాన్. ఆకాశం వంక చూపి 'అదే నాకు అచ్చివచ్చే చోటు. ఇన్నాళ్లూ దాని కోసమే వేచియున్నా' నన్నాను నా వలనే మా పశ్చిమ గోదావరి గాంధీ యుద్యమ నర్దార్, దండు నారాయణరాజుగారు 'B' నుండి 'C' కి మార్చమని పిటీషన్ పెటారు. ఆయనను 'C' కి దింపారు. అంధ్రకేసరి ప్రకాశం కూడ తనకీయబడ్డ 'A' class నుండి 'C' కి దింపమన్నట్లు, అందుకు బ్రిటీష్ సర్కారు అంగీకరించలేదని విన్నాను.

కొన్నాళ్ళ తరవాత అక్కడి నుండి బళ్ళారి Cantonment జైలుకు 'C' కాసు వాళ్ళతో కలిపి నన్ను బదిలీ చేశారు. అక్కడ సుమారు తొమ్మిది నెలలుంటిని, Mr. Greenwood, an Irish man (అక్కడి సూపరెంటు), స్వతహా క్రూరస్వభావుడు. అందు చేత నే సుమారు మూడువేలమంది మాప్లా మహమ్మదీయ ఖైదీలను అణచి పెట్టటానికి అతని కింద ఉంచారు. 1922 లో మాప్లాల తిరుగుబాటు సందర్భమది. 1930లో రాష్ట్రంలోని సత్యాగ్రహ 'C' క్లాసు గాంధీ ఖైదీల నందరినీ అక్కడ concentrate చేసేసరికి ఈ 6, 7 యేండ్ల మధ్య కాలంలో మాప్లా ఖైదీలను నానా హింసల పాల్చేసి పది పన్నెండు వందల సంఖ్యకు తెచ్చాడు Mr. Greenwood. మా సత్యాగ్రహ 'C' క్లాసు వాళ్ళం మొత్తం అప్పటికి 400 మాత్రమే. క్రమంగా పదకొండు వందలైనాము. మేమక్కడికి వెళ్ళిన వారం రోజులలోనే ఒక అపూర్వ సంఘటన జరిగింది. దానిని యిక్కడ వర్ణిస్తే కథ మరికొంతచోటు ఆక్రమిస్తుంది. అందుకని కొంత క్లుప్త పరుస్తాను. కొద్ది రోజులకు పూర్వం అక్కడికి ఖైదీగ వెళ్లిన నా. జోక్యం కూడ అందు కొంత వుంది. ఆ రోజు సోమవారం. సూపరెంటు inspection దినం. అసలు ఆ మనిషిది పటాటోప స్వభావం కనుక, పెద్ద చిన్న జైలు సిబ్బంది 40, 50 మందిని వెంట

దీసుకొని గడబిడి చేస్తూ వచ్చాడు గ్రీన్‌వుడ్. వ్యవహారం కొంత ముదిరిన తరువాత కొందరు సిబ్బంది పరుగెత్తుకొనివెళ్లి తుపాకులు కూడ తెచ్చారు. తెల్లవాడైన medical officer కూడ సిబ్బంది మధ్య నిలబడి నివ్వెర పోతున్నాడు. సూపరెంటు చేస్తున్న హంగామా చూచి అప్పటికక్కడున్న సుమారు 400 మంది రాజకీయ ఖైదీలు పిట్టగోడలు దూకి వచ్చి ఈ 50 మంది జైలు సిబ్బంధిని చుట్టవేశారు. Greenwood తలచుకుంటే అప్పటికప్పుడు పెద్ద Reserve Police ను పిలిపించి మమ్మల్ని fire చేయించియుండవచ్చు లేక బావా చితకా పచ్చడి చేయించవచ్చు. కాని ఏమి చేయాలో అతనికి తోచలేదు. అంతా దైవికం! అతని జీవితంలోనే యిదొక సరికొత్త సంఘటన. మాప్రాలను మాడ్చివేసిన రాక్షసి అతడు. అయినా ఆ సమయంలో అతన్ని ఆవహించింది ప్రాణభయ మందామా, అదీకాదు. ఎదుట కన డితే నలుగురు నృసింహావతారాలను కట్టగట్టి మింగివేయనుంకించే హిరణ్యకశిపుడతడు. చంకల యెత్తున రెండు చేతులూ పొడుగ్గా చాచి ఊపిరందనట్లు రొజుతూ వెనుకడుగు వేస్తున్నాడతడు. నోరుకూడ తెరిచాడెమో! తెచ్చిన తుపాకులను చూచి మాలోని నారాయణరావు అనే ఒకడు,

'మనల్ని తుపాకులతో పేలుస్తారట - అదేమిటో చూద్దాం. వరుసగా కూర్చోండి' అని పెద్దగా అరిచాడు. ఆ కేకలో నున్న మహిమేమిటో కాని, గుంపంతా విడివడి, ఒక్క వరుసను కూర్చున్నారు. బహు కొద్దిమంది నిలబడే వున్నాం. ఖైదీలలో యింత డిసిప్లిన్ చూచి గ్రీన్‌వుడ్ ఆశ్చర్య పడ్డాడు. ముందుకువచ్చి 'Does any body know English here?' అని ముక్తసరుగా ఒక్క వాక్యం పలికాడు. ఇంగ్లీషు చాలామందికి తెలిసినా, నన్ను ముందుకు తోశారెవరో. 'What is it I have done, tell me?' అన్నాడు సూపరెంటు. 'నన్ను కొట్టినాడని చెప్పండి' అన్నాడు ఒక స్థూలకాయుడు కోట సుబ్బారావు. "Don't lie I have been seeing him. He has not touched you!" అని బిగ్గరగా నేను కేక పెట్టాను. ఎవరేమనుకున్నారో! అంతా నిశ్శబ్దమయింది. మరెవ్వరూ నోరెత్తలేదు. సూపరెంటు నెమ్మదిగా ఆఫీసు వైపు దారి తీశారు. సిబ్బందీ అంతా అతని వెనుకనే నడిచివెళ్లారు. ఆ క్షణంతో అతనిలో ఏదో మార్పు వచ్చింది. ఆశ్చర్యం, అద్భుతం! కారణం దైవానికే తెలుసు. మేమా జైలు నుండి విడుదలయ్యే పర్యంతం, 7, 8 నెలలు, అతడు మా వద్దకు రాలేదు. సోమవారం Inspections మానుకున్నాడు. ఖైదీల యిబ్బందులేవైనా చెప్పుకోవలసి వస్తే మేమిద్దరం - నేను, మరొక మలయాళీ - అతని వద్దకు వెళ్లి మాట్లాడేవాళ్లం. అవకాశమున్నంతలో C క్లాసు కియ్య వలసిన ఆహార సౌకర్యాలన్నీ చేశాడు. స్నానానికి సబ్బు, తలకు నూనె, శుభ్రమైన బియ్యం, పులుసులోకి పప్పు, కూర ఆకులు, కాయలు, కంపెనీలకు వ్రాసి కావలసిన పుస్తకాలు పోస్టులో తెప్పించుకొనే స్వేచ్ఛ అన్నీ కల్పించాడు. డిప్యూటీ జైలర్ ప్రొవిజన్ స్టోర్సు నుండి ఆహార వస్తువులు తూపించి తెచ్చేపని నాది. కొద్ది రోజుల క్రితం జరిగిన గలాటాలో డిప్యూటీ జైలరు కూడ ఉన్నాడు. అతడు నాకు ప్రత్యేక మిత్రుడై 'You are the wisest of the lot' అనేవాడు నన్ను. జైలులో చనిపోయిన ఖైదీల శవాలను జైలు బైట గోతులు తీసి పూడ్చిపెట్టటం మామూలు. ఒక రోజున మాలో ఒక మళయాళీ ఖైదీ చనిపోయినాడు. 'పోయినవాడు ఒక పెద్దమనిషి, 'We want to cremate the dead body in our usual way' అన్నాను, నేను వెళ్ళి. వెంటనే 'Do as you like' అన్నాడు. శవ దహనానికి కావలసిన కట్టెలు పిడకలు, మొదలైనవన్నీ సప్లయి చేయించాడు.

(ఇంకా వుంది

గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ, 522 123) సౌజన్యంతో ....పుస్తకం వెల : రు. 20-00.

# డైరీ

## మార్చి 06, 1992

ఘంటసాల దివంగతులయే నాటికి పెద్దబ్బాయికి సంబంధం కుదిరింది తప్ప, పిల్లలెవరికీ పెళ్ళిళ్ళు కాలేదు. ఆ తర్వాతనే సావిత్రి విజయకుమార్‌కి, శ్యామల, సుగుణ, శాంతిలకు పెళ్ళిళ్ళు జరిపించింది. రెండవ అబ్బాయి రతన్ కుమార్ కూడా ఒక యింటివాడైతే, తన బాధ్యత తీరిపోతుందని రెండు మూడేళ్ళుగా అంటున్నది. ముప్ఫయ్యయిదేళ్ళుగా తెలిసిన సావిత్రి మా యింట్లో అందరికీ సన్నిహితురాలు. మాలతీ, మామయ్య, శారదలే కాదు, బంధువర్గ మంతటికీ ఆమె అంటే యిష్టం. రత్నకుమార్‌కి, కృష్ణకుమారికీ పెళ్ళిచూపులయాక ఫొటోలు తీసుకొచ్చి చూపించింది.... ఈ ఉదయం 7గం॥ 45 ని॥ లకు, కన్యా లగ్నాన, 'ఎమ్మెల్యేమ్' కళ్యాణ మండపంలో, ఆ యువతీ యువకులు కళ్యాణ దంపతులయారు. వేదిక మీదనున్న ఘంటసాల చిత్రపటం, ఎంతటి వారినీ స్మృతులతో ముంచగా, సావిత్రి కంట నిలిచిన బాష్పకణంలో ఆనంద విషాదాలు మిళితమై వుండటంలో ఆశ్చర్యం లేదు... రత్నకుమార్ కృష్ణకుమారీల నవజీవనయాత్ర శుభప్రదమూ ఆనంద దాయకమూ కావాలని ఆశీర్వదిస్తున్నాము. (తెలుగు రాని ఎందరో హీరోలు పలికే తెలుగు మాటలు నేపథ్య కంఠం రత్నకుమార్‌ది).

## ..... 07

రెండురోజుల క్రితం సాయింత్రం వేళ, ఆఫీసులో కూచుని కాగితాలు చూసుకుంటూ వుండగా, పల్లవన్ ట్రాన్స్‌పోర్ట్‌కి చెందిన సుందర వదనమ్ అనే ఆయన స్వయంగా వచ్చి బ్రహ్మకుమారీల ప్రెస్ కాన్ఫరెన్స్ ఇన్విటేషన్ యిచ్చారు. 'నా పేరు మీకెలా తెలుసు? ఎవరు చెప్పారు?' - అని అడిగాను. ఎంచేతనంటే నాదెంతకీ అధి భౌతికమే తప్ప ఆధ్యాత్మిక ప్రపంచం కాదు. 'మీ పేరూ, అడ్రసూ ఢిల్లీలో యిచ్చారో, మద్రాసులో యిచ్చారో నాకు తెలీదు. తప్పకుండా మాత్రం రండి. ఒక గంటలో అయిపోతుంది ప్రెస్ కాన్ఫరెన్స్' - అన్నారు ఆ సుందరవదనమ్.... 'ప్రజాపిత బ్రహ్మకుమారీస్ వరల్డ్ స్పిరుచ్యు

యల్ యూనివర్సిటీ' అరవై దేశాలలో 1800 బ్రాంచీలు గల అంతర్జాతీయ ఆధ్యాత్మిక సంస్థ. వీరి ప్రధాన కార్యాలయం మౌంట్ అబు (రాజస్థాన్)లోని పాండవ భవన్‌లో ఉంది. 1983 లో జరిగిన ప్రపంచ సభకు 40 దేశాల ప్రతినిధులు మౌంట్ అబుకు వచ్చారు. ఈ యూనివర్సిటీ, ప్రభుత్వేతర సంస్థగా ఐక్యరాజ్య సమితి వారి గుర్తింపు, 1981లో పొందింది. 70 సం॥ల బ్రహ్మకుమారి ప్రకాశ్‌మణి ఈ సంస్థకు ప్రధానాధిపతి. రాజయోగం ద్వారా వ్యక్తికి మనశ్శాంతి, లోకానికి విశ్వ శాంతి - వీరి ధ్యేయమూ లక్ష్యమూను. ప్రకాశ్‌మణి అనేక అంతర్జాతీయ సదస్సులలో పాల్గొని, 'శాంతిదూత' గా 'ఐరాస' వారి మన్నన పొందారు. 56వ మహాశివరాత్రి జయంతి ఉత్సవం నిర్వహించేందుకు ఆమె మద్రాసు వచ్చిన సందర్భంగా, ఈ ప్రెస్ కాన్ఫరెన్స్. (స్థానిక ఆఫీసు : 'శాంతిధామ్', Q - 96, అన్నానగర్ మూడవ అవెన్యు, మద్రాసు-40) పామ్‌గ్రోవ్‌లో నాలుగు గంటలకు. ఆరుగంటలకు కలైవణార్‌లో గవర్నరు తమిళనాడు భీష్మ నారాయిణసింగ్, రాజయోగిని ప్రకాశ్ మణి అధ్యక్షతలో, ఈ 56వ మహాశివ జయంతికి ప్రారంభోత్సవం గావిస్తారు. బ్రహ్మకుమార్ రాజయోగి జగదీష్‌జీ ముఖ్యాంశం చెప్పగా, మోహినీజీ సామూహిక మెడిటేషన్ గురించి ప్రసంగిస్తారు. రాజసులోచన 'సువర్ణ శకోదయం' (The Dawn of the Golden Era) అనే నృత్యనాటిక ప్రదర్శిస్తారు....

జస్టిస్ గోకులకృష్ణన్, దీన్ దయాళన్, మనూ భక్తవత్సలం, అక్కమ్మా. కృష్ణమూర్తి, సౌందరమ్ కైలాసమ్, విజిపి సంతోషమ్, శాంతిలాల్ జైన్ మున్నగువారు ప్రకాశ్ మణిజీని గౌరవిస్తారు. ఆమె బృహత్కృషిని వేదిక పై అభినందించే వారిలో ఇండియన్ బాంక్ గోపాలకృష్ణన్, మద్రాసు పోర్ట్ ట్రస్ట్ పాల్ రాజు కూడా ఉన్నారు. ఈ సంస్థ ప్రధాన స్పోక్స్‌మాన్ (విషయ వివరణ గావించే వ్యక్తి) బ్రహ్మకుమార్ జగదీష్ చందర్, హిందీ ఇంగ్లీషు భాషలలో సుమారు 200 ఆధ్యాత్మిక గ్రంథాలు రచించారు....

"ఆధ్యాత్మిక విద్య మోక్ష సాధనకే అనుకుంటారు - అది కరెక్ట్ కాదు. నిరాశా, నిస్పృహలకు, అశాంతికి మూల హేతువు ఆధ్యాత్మిక దృక్పథం లేక పోవడం! ప్రతి ఒక్కరూ యింకా ఆర్జించాలనీ, యింకా సుఖపడాలనీ పరుగు పందెంలో జొరబడి, అలసి పోతూ వుంటారు. పరస్పర సహకారం అలవరచుకోవాలి గాని పోటీపడి ప్రయోజనం లేదు. దురాశవల్ల దుఃఖమని తెలిసి కూడా వెర్రి ఆశలు పెంచుకుంటున్నారు. మనస్సాక్షి మార్గం చూపగలదు గాని ప్రలోభానికి లోనై తప్పుదారి పడతాం. మతము వేరు, ఆధ్యాత్మికత వేరు. మతం కారణంగా తలలు నరుక్కున్నారు కాని, మన ఆధ్యాత్మిక వారసత్వం

సద్భావాన్ని పెంచిందే గాని ఎవరికీ హాని చేయలేదు. ప్రేమ, సహకారం, సోదరభావం - వీటిని పెంచేందుకు పాటు పడేదే నిజమైన విద్య, ప్రతి మతమూ సత్యానికీ సౌందర్యానికీ ప్రతిరూపమే దేవుడు - అంటున్నది. ఆ దైవత్వం వైపుగా ప్రయాణించ డమే ఆధ్యాత్మికత. పర్యావరణాన్ని కాపాడాలన్నట్టే, కాలుష్యం నుంచి మనసుని కాపాడుకోవాలి. సాంఘిక దౌర్జన్యాలకు, వ్యక్తిగత మనస్సంక్షో భాలకు, దేశాల మధ్య రక్త పాతానికి అసలు కారణం సచ్చింతనా రాహిత్యం. మంచిగా వుండి, మంచిని ప్రోది చేయ డం ద్వారానే ఈ రుగ్మతల నుంచి బయట పడగలుగుతాం - అందుకు కావలసినది ఆధ్యాత్మిక విద్య, ఆధ్యా త్మిక శిక్షణ" - అన్నారు బ్రహ్మ కుమార్ రాజయోగి జగదీష్ చందర్ పాత్రికేయులతో. ఆ తర్వాత ప్రకాశ మణిజీ హిందీలో చేసిన ప్రసంగాన్ని తమిళంలోకి అనువదించారు .... ప్రపంచ వ్యాప్తంగా 2 లక్షల 50 వేల మంది స్టూడెంట్స్ గల ఆధ్యాత్మిక విద్యా కేంద్రమిది. రాజయోగం ద్వారా జీవితాన్ని మెరుగుపరుచుకోగల మార్గాలు సాధకులకు చెబుతారు.

## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు .....................................................

అడ్రసు .....................................................

.....................................................

.....................................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004

. . . . 08

పోయిన నెల (ఫిబ్రవరి) ఇరవై ఒకటో తేదీన శ్రీహరికోట నుంచి లక్ష్మీరామన్ ఫోన్‌చేసి 'మాలతీ చందూర్‌గారు వున్నారా?' - అని అడిగారు. 'ఉన్నారు. మాట్లాడుతున్నది యన్నార్ చందూర్ - విషయమేమిటో చెప్పండి' — అన్నాను. 'మిస్టర్ చందూరా, నమస్కారం. నేనిక్కడ షార్ సెంటర్‌లో ఇంజనీరుని. 'వరల్డ్ వుమెన్స్ డే' రోజున మాలతీ చందూర్‌గారిని అతిథిగా పిలవాలని....' .... 'మాలతిగారి వెంట చందూర్ గారు వుంటారాయె - .... మరి మీ ఫంక్షన్‌కి పురుషులు రావచ్చా?' - అని అడిగాను.... 'అదేమిటండీ అలా అడుగుతారు? మా డైరక్టరుగారూ, స్టాఫూ అందరూ వస్తున్నారు. మీరు లేనిదే ఆమె రారని మాకు తెలుసు' - అన్నారు లక్ష్మీరామన్. తెలుగు చేసి చెబుతున్నాను గాని టెలిఫోనిక్ కాన్వర్సేషనంతా యింగ్లీషులోనే సా గిం ది. 'వ్రాత మూలకంగా ఆహ్వానం పంపండి. అంగీకారం తెలుపుతూ మీకు సమాధాన వస్తుంది' - అని చెప్పాను. మమ్మల్ని తీసుకెళ్లి, తీసుకొచ్చే వెహికిల్, మాలతిగారి 'బయో - డేటా,' ఎనిమిదో తేదీ ఉదయం ఎన్ని గంటలకు బయలుదేరేదీ - యిలాటి వాటి గురించి లక్ష్మీరామన్ కనీసం నాలుగైదు సార్లు శ్రీహరి కోట నుంచి ఫోన్ చేసి వుంటారు. ప్రతిసారీ నేను మాట్లాడటమే! శ్రీమతి చందూర్ కంఠం కూడా ఆమె ఫోనులో వినలేదు.

తెలుగు రచయిత్రి మాలతీ చందూర్, తమిళ రచయిత్రి అనూరాధా రమణన్ ప్రపంచ వనితా దినోత్సవంలో పాల్గొననున్నారు. ఈ మీటింగ్ కంటె మాకు ముఖ్య ఆకర్షణ, భారత వైజ్ఞానిక బృందం, దేశ ప్రజలకు గర్వకారణమైన అంతరిక్ష విజయం సాధించిన పవిత్ర క్షేత్రం స్వయంగా చూడగలగటం, ఆ అద్భుతాలను కొంతలో కొంత తెలుసుకు, మన ప్రగతికి తృప్తి పడటం.... సుళ్లూరుపేట వద్ద డైవర్సన్ తీసుకు, పులికాట్ సరస్సు మీదుగా, ఈ ఫిబ్రవరిలో కూడా అక్కడక్కడ కనిపించే పక్షులని చూస్తూ, 'వేగ నిరోధకము' ముందున్నది (స్పీడ్ బ్రేకర్) అని హెచ్చరికలు పాటిస్తూ, రెండు 'రక్షణ నిలయములు' దాటుకు (సెక్యూరిటీ చెక్ పోస్ట్స్), యిక్కడి 'అంతరిక్ష నివాసమ్' (గెస్ట్ హవుజ్) పన్నెండయేసరికి చేరుకున్నాం. అనురాధా రమణన్ వెంట వాళ్లమ్మాయి, మరొకాయన (సెక్రటరీ) వచ్చారు. వారికొక రూమూ, మాకొక రూమూ పక్కపక్కనే యిచ్చారు. రెండూ ఏసి రూమ్స్. కొంచెం ఫ్రెషెన్ అయామో లేదో (ముఖాలు కడుక్కు, ఎగిరిన జుట్టు దువ్వుకోవటం), పబ్లిసిటీ ఆఫీసరు రవీంద్రనాథ్, షార్ సెంటర్ డైరక్టరుగారి భార్య గీతా అరవముదన్ (ఇవ్వాళ మార్నింగ్

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరివెర్బిస్
నేల - నీరు
మహానగరంలో
జీవితం
ఏమైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలోమైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

'హిందూ'లో తమిళ చిత్ర కథా నాయికల గురించి ఆమె రాసిన ఆర్టికల్ బయలుదేరే ముందు చదివి వుంటే ఎంత బావుణ్ణు - అనిపించింది ; తిరిగి వచ్చాక చదివాము.... ఆమె సీజన్డ్ ఇంగ్లీషు జర్నలిస్ట్), ఆమెతో మరో యిద్దరూ వచ్చారు. కొంచెం ముందొచ్చిన రవీంద్రనాథ్‌తో మాట్లాడుతున్న స్పేస్ రిసెర్చ్, తుంబా, శాటిలైట్స్ యిత్యాదివి మానేసి, సినిమాలు, పుస్తకాలు, స్త్రీ పురుష స్వభావాలు, లోకవృత్తం యిలాటివాటిలో పడ్డాం. సాయింత్రం మీటింగు అయిపోయాక, వ్యవధి వుంటే ఒక ఫిలిమ్ చూపిస్తాననీ సెంటర్‌లోని వేరువేరు సెక్షన్‌లకి దగ్గరుండి తీసుకు వెళ్తాననీ అన్నారు రవీంద్రనాథ్.

భోజనమూ, కొద్దిసేపు విశ్రాంతి అయాక, నాలుగు గంటలకి, ఎయిర్ కండీషన్డ్ అసెంబ్లీ హాలులో ప్రపంచ స్త్రీ దినోత్సవం – ఆ సందర్భంగా జరిపిన పోటీలలోని విజేతలకు బహుమతి ప్రదానం. ఆర్టిస్ట్ కందస్వామి (అక్కడి స్కూలులో డ్రాయింగ్ టీచరు) వేసిన చిత్ర పటాలు చూసి, ఆడిటోరియమ్ ప్రవేశించాము. మొదటి వరసలో డైరక్టరు అరవముదన్ పక్కసీటు నాకు అట్టే పెట్టారు. పరస్పర పరిచయాలు, స్పీచ్‌లూ.... 'పాశ్చాత్య దేశాలతో పోల్చి చూస్తే, మనకు స్త్రీ స్వాతంత్ర్యం, గాంధీగారి ధర్మమా అని, దేశ స్వాతంత్ర్యంతో బాటు తేలికగా లభించింది. రెండవ తరగతి పౌరులుగా స్త్రీలని పరిగణించే పద్ధతి నశించాలి. సమాజంలో మార్పు అమాంత్రం రాదు, నెమ్మది నెమ్మదిగా వస్తుంది' - అన్నారు మాలతీ చందూర్ స్త్రీ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోని ప్రధాన ఘట్టాలు పేర్కొంటూ. 'స్వాతంత్ర్య మనేది ఒకరిచ్చేదేమిటి ? మనకి మనం తెచ్చుకోవాలి. మనకు స్వాతంత్ర్యం లేదనుకోటం కేవలం ఒక అపోహ. పురుషులని, సంఘాన్ని నిందించటం కాదు. మనకిగా మనం మనోబలం తెచ్చుకోవాలి' - అన్నారు అనూరాధా రమణన్.... 'ఇది పురుషాధిక్య ప్రపంచమనేది సామాజిక వాస్తవికత. ఆ ఆధిక్యత ప్రస్ఫుటంగాను, పరోక్షంగాను వెల్లడయే అవకాశం ఉంది. మన నిరసన ఎంతకీ ఆ ఆధిక్యతా ప్రదర్శన పట్ల ! విద్యావంతులై, ఉద్యోగాలు చేసుకుంటున్న స్త్రీ పురుషుల మధ్య సమానత్వమూ, సద్భావమూ, సహకార చింతన లేవని ఎలా అనగలం ?' - అన్నారు సభాధ్యక్షత వహించిన గీతా అరవముదన్.

బహుమతి ప్రదానం, ప్రశ్నోత్తర వేదిగ జరుగుతూండగా, 'మేవుల్సన్‌టన్ క్రాఫ్ట్, హారియట్ స్టవ్, ఎలిజిబెత్ ఫ్రే వంటివారి గురించి చెబుతున్న మిసెస్ చందూర్ ఏం చదువుకున్నారు, ఎంత దాకా చదువుకున్నారు - పోయిన నెలలో తిరుపతిలో ఆమెకి డాక్టరేట్ యిచ్చారట ?' అని ప్రశ్నించారు

డైరక్టరు అరవముదన్. 'ఆమె మెట్రిక్ కూడా పాస్ కాలేదు - సెల్ఫ్ఎడ్యుకేటెడ్' – అన్నాను. 'Behind every successful man there is a woman - అనేది రివర్స్‌లో చెప్పుకోవాలి' అన్నారు ఆయన నవ్వుతూ! మాలతీ చందూర్‌లో మాలతి ఎంత, చందూర్ ఎంత అనేది నాలుగు పదుల ప్రశ్న. అందుకనే కావచ్చు ఈ మధ్య నొక ఫ్రెండు, పేరులో సైతం అద్వైతాన్ని సాధించిన దంపతులు మీరు - అంటూ కాంప్లిమెంట్ చేశారు.

.....09

ఉదయం ఎనిమిదిన్నరకి పబ్లిసిటీ ఆఫీసరు రవీంద్రనాథ్ మమ్మల్ని, అనూరాధ పార్టీని, విజయవాడ ఆలిండియా రేడియోనుంచి వచ్చిన ముగ్గురుని, తమ ఆఫీసు **వాన్‌లో** మొట్టమొదట స్పేస్ **మ్యూజియమ్‌కి** తీసుకు వెళ్లారు. శ్రీహరికోటలో జరిగే వైజ్ఞానిక కార్యక్రమాలని, అంతరిక్షయాత్రా స్వరూపాన్ని, మానవ నిర్మిత ఉపగ్రహం భూకక్ష్యని ఛేదించుకు రోదసిలోకి ఎలా వెళ్లేదీ, విస్మయం గొలిపే విధంగా మనకు చూపిస్తుంది - స్మాల్ స్కేల్‌లో ఈ మ్యూజియమ్.... ప్రొపలెంట్‌తో రాకెట్‌ని నింపడం, రాకెట్‌నీ రాకెట్ మోటార్లనీ టెస్ట్ చేసి లాంచింగ్ కాంప్లెక్స్‌కి తీసుకు వెళ్లడం, ఈ లాంచింగ్ కాంప్లెక్స్‌లోని సమస్తాన్ని సుదూరాన సురక్షిత ప్రాంతానున్న కంట్రోల్ సెంటర్ తన కంప్యూటర్లతో అదుపులో ఉంచుకోవడం,

నిర్దేశించిన పథానికి (Projected Trajectory) ఏ స్వల్ప వ్యత్యాసం ఏర్పడ్డా, మొత్తం రాకెట్‌నే భస్మీపటలం చేయగల సాధన - యిలాటివన్నీ మనని ఆశ్చర్యాంబుధిలో ముంచుతాయి.

'షార్' (SHAR) అనగా శ్రీహరికోట రేంజ్.... 1963లో, అంటే నెహ్రూగారింకా జీవించి వున్న కాలంలో, తిరువనంతపురం సమీపానున్న 'తుంబా'లో ఇండియన్ స్పేస్ రిసెర్చి ఆర్గనైజేషన్‌కి అంకురార్పణ జరిగింది. 1967లో 'రోహిణి- 75' తుంబా నుంచి అంతరిక్షంలోకి వెళ్లింది - యిది సౌండింగ్ రాకెట్ (రాకెట్లలో అనేక తరహాలు వున్నాయి - వాతావరణం చెప్పేవి, వార్తాసమాచారం అందించేవి - ఆ విధంగా). అంతరిక్ష విజ్ఞానంలో మనదేశం వెనకబడ కూడదని, కేంద్ర ప్రభుత్వం, స్పేస్ ప్రోగ్రామ్‌పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది.... విక్రమ్ సారాభాయ్ తూర్పు తీరరేఖ యావత్తూ వైమానిక పర్యవేక్షణ జరిపి, 46 కి॥ మీ॥ సముద్రరేఖ, 150 చ॥కి॥మీ॥ వైశ్యాలమూ గల శ్రీహరికోట దీవి స్పేస్ ప్రోగ్రామ్‌కి అన్ని విధాలా అనుకూలంగా ఉంటుందని నిర్ణయించారు. తూర్పున బంగాళా ఖాతమూ, మిగతా మూడు వైపులా బకింగ్ హామ్ కెనాలూ, పులికాట్ సరస్సూతో మద్రాసుకి 100 కి॥మీ॥ ఉత్తరాన గల ఈ ప్రదేశాన్ని 1969 లో కేంద్ర ప్రభుత్వం తన అజమాయిషీలోకి తెచ్చుకు, ఇండియన్ స్పేస్ రిసెర్చి ఆర్గనైజేషన్‌వారి రాకెట్ లాంచింగ్‌కి సకల సదుపాయాలతో కూడిన వనరుల ఏర్పాటుకి పూనుకుంది.

పులికాట్ సరస్సుకి డిసెంబరు నెలలో సైబీరియా నుంచి వలస పక్షులు వస్తాయి. సరుగుడూ, యూకలిప్టస్, దట్టంగా పెరిగిన పొదలూ తప్ప మహా వృక్షాలేమీ లేవు. నక్కలు, అడవి దున్నలు, పాములు గల ప్రాంతం. ఒక్కప్పుడు యానాదులు వుండే వారిక్కడ. వారిని పునరావాస సౌకర్యంతో పంపించివేశారు. సుమారు 2700 మంది ఉద్యోగులు, తమ సంసారాలతో, ప్రభుత్వం యిచ్చిన క్వార్టర్స్‌లో, ఈ మోడల్ టౌన్‌షిప్‌లో ఉంటున్నారు. అంతా ప్రొటెక్టెడ్ ఏరియా - గుర్తింపు కార్డులేనిదే రాకపోకలు సాధ్యంకాదు. 12 వ తరగతి దాకా పబ్లిక్ స్కూలు వుంది. ఉద్యోగస్థులలో స్త్రీల సంఖ్యేమీ తక్కువ కాదు. సుళ్లూరుపేట 17 కి॥ మీ॥. డైవర్షన్ తీసుకు, రెండు మూడు కిలోమీటర్లు రాగానే ఇండియన్ స్పేస్ రిసెర్చి ఆర్గనైజేషను వారి ఆఫీసు కనిపిస్తుంది. ఆ తర్వాత పులికాట్ సరస్సు.

శ్రీహరికోట నుంచి మొట్టమొదలు సంధింపబడిన రాకెట్ పేరు 'రోహిణి - 125' - 1971 అక్టోబరు 9 వ తేదీన. అది కూడా సౌండింగ్ రాకెట్ .... స్పేస్ బూస్టర్ ప్లాంట్ 1977 లో

స్థాపింపబడింది. ప్రాపెలెంట్, అనగా రాకెట్ గర్భంలో ఉండే ఇంధనం. అమోనియమ్ పెర్క్లొరేట్, అల్యూమినియమ్ రజను (అతి సన్నటి పొడి) - ఈ రెండిటినీ ముద్దలా చేయగల హైడ్రాక్సిల్ - టెర్మినేటెడ్ - పొలిబుటడిన్, ఈ పేస్టుని సమపాళంలో ఉంగచల థర్మల్ ఇన్సులేషన్. రెండున్నర టన్నుల పదార్థం మరి కొన్ని కెమికల్స్‌తో కలిపినది, రాకెట్ లోకి ఎక్కించి, రకరకాల టెస్టులకి గురి చేసి, అడ్డంగా ఎక్కించినది నిలువుగా నిలబెట్టి లాంచింగ్ పాడ్‌కి తీసుకువెళ్తారు. ముందుకెళ్తున్న కొద్దీ సాంకేతిక పరమగు జటిల సమస్యలనేకం పరిష్కరించవలసి వస్తుంది. సాటిలైట్ లాంచ్ వెహికిల్, ఆగ్మెంటెడ్ సాటిలైట్ లాంచ్ వెహికిల్, పోలార్ సాటిలైట్ వెహికిల్. నిలబెట్టి లాంచింగ్ పాడ్ దాకా పట్టుకొచ్చిన రాకెట్‌ని, అంతరిక్షంలోకి పంపేదాన్ని వెహికల్ అంటారు.

'పియస్సెల్వి' లాంచ్ కాంప్లెక్స్‌లో, 2 వేల టన్నుల బరువూ 76 మీటర్లు ఎత్తూవున్న స్టీల్‌స్ట్రక్చర్‌లోకి, 60 టన్నుల క్రేన్ 'సాటిలైట్ ఇంటిగ్రేషన్' జరుపుతుంది. లాంచింగ్ ఏర్పాట్లన్నీ అయాక, ఆ చుట్టుపట్ల కొన్ని కిలోమీటర్ల దాకా జన సంచారం ఉండదు. ఆ పైన సమస్తం వీక్షించేది కంప్యూటర్ సెంటర్ నుంచే! టెలీ కమాండ్స్ అన్నీ అక్కడ నుంచే!

# ముఖ చిత్రం

విశ్వకవి రవీంద్ర కవీంద్రుని పసిడి పలుకులు :

జలధారలు లేకుండా పర్వతం వుండదు.

జీవితంలోని జ్ఞాపకాలు ఆత్మకథ కానేరవు

మందు, మంచి సలహా రుచికరంగా వుండవని చెప్పాడు వ్యవసుడు.

ఎడారిలోని యిసుక మిల మిలా మెరుస్తూ వుండవచ్చు : కాని, ఫలాన్ని ఆశించే మనిషి, నల్లటి మట్టిలో విత్తనం నాటాలి.

భారత దేశాని దెప్పుడూ ద్విపాత్రాభినయం. ఒకవైపున అన్నీవున్న కుటుంబీకుడు ; మరొక వైపున సమస్తం వొదులుకున్న విరాగి.

పరస్పర వైరుధ్యమే ఈ సృష్టికి మూలం. లోక పరిపాలన రాజూ రాణీలది ; దివా రాత్ర ములది ; ఏకత్వ భిన్నత్వాలది ; పరిణామ పదార్థాలది.

అతను, చరిత్రను నడిపిస్తున్నానంటాడు. శిలాప్రతిమలు సృష్టిస్తాడు ; జీవిత చరిత్రలు లిఖిస్తాడు ; సమాధులు నిర్మిస్తాడు. ఈ పరుగులో వారిగి పోయిన విగ్రహాలూ చెరిగి పోయిన పేర్లూ అతనికి గుర్తు రావు.

ఇన్‌సాట్ అనగా ఇండియన్ నేష నల్ సాటిలైట్ సిస్టమ్. 144 కోట్ల 'ఇన్‌సాట్-1 D' కేప్ కెనవరెల్ నుంచి (అమెరికా) 1990 జూన్ 12వ తేదీన అంతరిక్షంలోకి వెళ్ళి, పది రోజులలో జియో-స్టేషనరీ ఆర్బిట్ (36 వేల కి.మీ.) చేరుకు, జులై 17వ తేది నుంచి ఉపయోగబడుతోంది. ఇది 'త్రి-ఇన్-ఒన్' సాటిలైట్. ఇంటెల్‌శాట్‌కి, అరబ్‌శాట్‌కి (Intelsat, Arabsat) చెల్లించవలసిన రుసుము తప్పింది.... మన ఆర్యభట్ట (1975) భాస్కర్ (1979) సోవియట్ యూనియన్ నుంచి, కమ్యూనికేషన్ శాటిలైట్ 'యాపిల్' (1981) అమెరికా నుంచి అంతరిక్షంలోకి, వెళ్లాయి. శాటిలైట్ ఆయుర్దాయం, అంతా సవ్యంగా ఉంటే ఏడు సంవత్సరాలు.

'ప్రొపెలెంట్ యిక్కడ తయారవుతుందా?' - అని అడిగాను రవీంద్రనాథ్‌ని మాటల సందర్భంగా.

'స్పేస్ రిసెర్చిలో ప్రధాన స్థానం తుంబాది - అక్కడ ఆరువేల మంది ఉన్నారు - ఇక్కడ 2700 - ఒరిస్సా తీరాన యింకో సెంటర్ ఉంది అక్కడ రెండంకెలలోనే! ప్రొపెలెంట్ తుంబా నుంచి వస్తుంది. హస్సాన్, అహ్మదాబాద్, మారిషస్ - యిలా ట్రాకింగ్ స్టేషన్స్ చాలా ఉన్నాయి. అంతరిక్ష విజ్ఞాన వ్యాప్తిలో ఐక్యరాజ్య సమితి ఏజన్సీల ప్రమేయం వుంది. ట్రాఫిక్‌రూల్స్ మాదిరి అన్నిదేశాలూ కొన్ని నిబంధనలు పాటించక తప్పదు' - అన్నారు.... 'షార్' మిత్రులు యిచ్చిన జ్ఞాపిక - మా యింట్లో మేము కూచునే స్థలానికి కొత్త అందాన్నిచ్చింది.

. . . . . 15

18వ కళాసాగర్ ఫిలిమ్ అవార్డ్స్ లిస్ట్‌ని కార్యదర్శి సుభాన్, యివ్వాళ పాత్రికేయ సమావేశంలో విడుదల చేశారు. ఈ సంవత్సరం న్యాయనిర్ణేతలు : పారిశ్రామికవేత్త ఓబుల్ రెడ్డి; నెల్లూరు రాఘవా థియేటర్ల ప్రసన్న కుమార్ రెడ్డి; ప్రొడ్యూసర్ విజయా బాపినీడు. కళాసాగర్ సభ్యుల బేలట్ పేపర్లు, వాటి పరిశీలన, న్యాయనిర్ణేతల అభిప్రాయం - ఈ బహుమతి ప్రదానానికి ఒక విశిష్టమైన పద్ధతి ఉంది. ట్రస్ట్ అధ్యక్షులు యమ్మెస్ రెడ్డిగారికి సైతం, ఈ వివరాలు అప్పటిదాకా తెలియవు - అంత గోప్యంగా జరుపుతారు. అయితే, అవార్డుల సంఖ్య అధికమవడం వల్ల (ఈ సంవత్సరం 23) వెనకటి ప్రత్యేకత కొంతమేర కోల్పోతున్నాయని చెప్పక తప్పదు. అయిదారుకి మించనప్పుడే యిచ్చేవారికీ పుచ్చుకొనేవారికీ ఘనంగా ఉంటుంది. మూడేళ్లకొకసారి రొటేషన్ పద్ధతిలో అన్ని శాఖలను తృప్తి పరచవచ్చు. మద్రాసులోని తెలుగువారి సాంస్కృతిక జీవనంలో, కళాసాగర్ ఒక గౌరవ స్థానం పొందింది గనక, ఈ అవార్డులు ఎక్కువ మందిని తృప్తిపరిచేలా గాక, కొద్దిమందికి వన్నె తెచ్చేవిలా వుంటే బావుంటుందని మా అభిప్రాయం. ఈ సంవత్సరం అవార్డులు : 1) ఉత్తమ

చిత్రం - కలికాలం - జెయస్‌కె ; 2) స్పెషల్ కమెండేషన్ - అశ్విని - ఉషా కిరణ్ ; 3) ఉత్తమ నిర్మాత - శ్యామ్ ప్రసాద్‌రెడ్డి - ఆగ్రహం ; 4) ఉత్తమ దర్శకుడు - ముత్యాల సుబ్బయ్య - కలికాలం ; 5) ఉత్తమ నటుడు - వెంకటేష్ - చంటి ; 6) నటి - శ్రీదేవి - క్షణక్షణం ; 7) స్పెషల్ కమెండేషన్ - అశ్వనీ నాచప్ప - అశ్విని ; 8) కారెక్టర్ యాక్టర్ - దాసరి నారాయణరావు - మామగారు; 9) స్పెషల్ కమెండేషన్ - వేలు - కలికాలం ; 10) కారెక్టర్ యాక్ట్రెస్ - జయసుధ - కలికాలం ; 11) కామిడియన్ - బ్రహ్మానందం - చిత్రం భళారే విచిత్రం ; 12) స్పెషల్ కమెండేషన్ - మల్లిఖార్జునరావు - ఏప్రిల్ 1 విడుదల ; 13) హాస్యనటి - శ్రీలక్ష్మి - ఇద్దరు పెళ్లాల ముద్దుల పోలీస్ ; 14) ఉత్తమ కథ - అశ్విని ; 15) స్పెషల్ కమెండేషన్ - కలికాలం ; 16) డైలాగ్స్ - పీపుల్స్ ఎన్‌కౌంటర్ - పరుచూరి బ్రదర్స్ ; 17) ఉత్తమ గేయం - అందమైన వెన్నెలలోన - అసెంబ్లీ రౌడీలో రసరాజు ; 18) నేపథ్యగాయకుడు - యస్పీ బాల సుబ్రహ్మణ్యం - క్షణక్షణంలో - జామురాత్రి ; 19) గాయని - వాణీ జయరామ్ - స్వాతికిరణంలో - ఆనతీయరా హరా ; 20) సంగీత దర్శకులు - కీరవాణి - క్షణక్షణం ; 21) కెమెరా - గోపాలరెడ్డి - క్షణక్షణం ; 22) ఎడిటర్ - త్రినాధ్ - గ్యాంగ్ రౌడి ; 23) ఫైట్ ఆర్టిస్ట్ - మంజునాథ్ - స్వాతికిరణం .... లిస్టుని బట్టి క్షణక్షణం, కలికాలం ప్రేక్షకులని అధికంగా ఆకట్టుకున్నాయని చెప్పవచ్చు.... కళాసాగర్ జన్మించి ఇరవై సంవత్సరాలయిందనీ, మంచిని పెంచడమే ఈ సాంస్కృతిక

సంస్థ ధ్యేయమనీ చెప్పారు ట్రస్ట్ ఛెయిర్‌మాన్ యమ్మెస్ రెడ్డి. 1991 లో సెన్సారైన 114 చిత్రాల నుంచి ఈ ఎంపిక జరిగింది.

. . . . . 16

పొట్టి శ్రీరాములు 91వ జయంతి సందర్భంగా నోరి శ్రీనాధ వెంకట సోమయాజులు రచించిన 'ధ్యాన యోగం' అనే ఆధ్యాత్మిక గ్రంధాన్ని ప్రొఫెసర్ చిన్న కృష్ణయ్య విడుదల చేశారు. "భగవద్గీతలోని 18 అధ్యాయాలు వివిధ యోగాలు. అర్జున విషాద యోగంతో ప్రారంభమై సాంఖ్య కర్మయోగాలతో ముందుకి సాగి, మోక్ష సన్న్యాస యోగంలో ముగిసే, ఈ పవిత్ర గ్రంథంలో 'యోగము' అనే మాటకు ఎంతో లోతైన అర్థం వున్నది. 'యజ్ఞము, యాగము, యోగము' పరస్పరాశ్రితములు. విశ్వరూప సందర్శనం తర్వాత భక్తియోగం గురించి చెబుతూ, 'సంతుష్ట స్వతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః.... సర్వ భూతానాం మైత్రః - అని, చెబుతాడు కృష్ణుడు అర్జునునికి" — అన్నారు చిన్న కృష్ణయ్య. ఆయన వాక్యధారలను ఎంతో శ్రద్ధగా ఆలకించారు శ్రోతలు. ఈ నాటి ముఖ్య అతిథి ప్రఖ్యాత జర్నలిస్ట్ ఇంటూరి వెంకటేశ్వరరావు ; ఆ తర్వాత కల్చరల్ ప్రోగ్రామ్‌లో ఘంటసాల విజయకుమార్ పాటలు - తండ్రి గారి పాప్యులర్ సాంగ్స్ తనయుని గాత్రంలో. స్వాగతం వైయస్ శాస్త్రి చెప్పగా, వందన సమర్పణ మల్లిక్. ఇతర కార్య భారం వల్ల ఇంటూర్ వారి మాటలు, విజయకుమార్ పాటలు వినే అవకాశం లేకపోయింది.

. . . . . 19

సుర్జిత్ ఘోష్ 'ప్రేమ' అనే సాహిత్య క్వార్టర్లీని పన్నెండేళ్లుగా కలకత్తా నుంచి బెంగాలీలో ప్రచురిస్తున్నారు. నాలుగువేల మంది చందాదారులు వున్నారట. రెండేళ్ల క్రితం ఈ పత్రిక, - ప్రపంచ సాహిత్యం, భారతీయ సాహిత్యం, బెంగాలీ సాహిత్యం - మూడిటి తీరు తెన్నులూ పరిశీలిస్తూ ఈ ఒక ప్రత్యేక సంచిక - 1/4 డెమ్మీ సైజులో మూడువందల యాభై పేజీలది - ప్రచురించింది. డిమాండ్ ముందు తెలుసుకు, అచ్చు వేశారట. వేసిన పదిహేను వేల కాపీలూ నెలతిరక్కుండా ఖర్చయి పోయాయట. బెంగాల్‌లోని ప్రతి లైబ్రరీలోను — స్కూలు, కాలేజీ, గ్రామ, పంచాయితీ, పబ్లిక్, ప్రయివేట్ — అన్ని లైబ్రరీలలోను, ఏభై రూపాయిలు ధర పెట్టిన ఈ సంచిక ఉన్నదని ఆయన చెప్పారు. ఆ సంచిక మాకు సాహిత్య అకాడమీ ఆఫీసులో చూపించారు. రంగు రంగుల బొమ్మల ఆర్భాటం కాదు - సీరియస్ రీడింగ్ మేటర్. ఉదయం పదకొండు గంటలకి సెక్రటరీ కృష్ణమూర్తి - యిలా ఫలానా వారు వస్తున్నారు తప్పకుండా రండి, నాలుగు

గంటలకి వచ్చి, అయిదుకి వెళ్లి పోవచ్చు. ఫోనులో దొరికిన పది మందిని పిలిచాను, ఏడెనమండు గురైనా వస్తారు' అన్నారు.... సుర్జిత్ ఘోష్ చాలా దేశాలు పర్యటించారు, అనేక చోట్ల లిటరరీ ఫ్రెండ్స్ వున్నారు, సాహితీ సంస్థలతో అనుబంధం వున్న వ్యక్తి. 'ఆఫ్రికా, ఆస్ట్రేలియా, జర్మనీ, ఫ్రాన్సు, జపాన్‌ల నుంచి వ్రాస్తున్న రచయితల పేర్లు మనకి తెలుసు; వారి రచనలు మనకి అందుబాటులో ఉంటున్నాయి. కాని, ఒరియాలోను, మరాటీలోను, మళయాళంలోను, ఏమొస్తాన్నాయో తెలీదు. ఈ భాషా భేషజం ప్రజలనేగాక సారస్వతాన్ని కూడా సంకుచిత పరుస్తోంది' అన్నారాయన. పాప్యులర్ పిరియాడికల్స్, బుక్ పబ్లిషింగ్, లిటరేచర్, లిటరవాల్యూస్ — యిలా ఒక గంట సేపు జరిగిన యిష్టా గోష్టిలో ఎన్నో జోక్సూ, ఎన్నో యానక్‌డోట్సు.... 'మా ఏడెనమండుగురిలో జయ కాంతన్ ఫేస్ ఒక్కటే నేను అచ్చులో చూశాను - మిగతా అందరూ నాకు కొత్తవారే' - అన్నారాయన.... ముప్ఫయి ఒకటి సాయింత్రం రైటర్స్ మీట్ వున్నదనీ, మా దంపతులు తప్పక రావాలనీ, సమావేశానికి ముందో తర్వాతో మమ్మల్ని ఆశాపూర్ణా దేవి, కవితా సిన్హాల వద్దకు తీసుకు వెళ్తాననీ తను 31 ఉదయం ఫ్లయిట్‌కి గాని కలకత్తా చేరుకోవడం లేదనీ చెప్పారు

సుర్జిత్ ఘోష్ (మేము మార్చి 27 నుంచి ఏప్రిల్ ఒకటిదాకా భారతీయ భాషా పరిషత్తు వారు మాలతీచందూర్ 'హృదయ నేత్రి'కి యిస్తున్న అవార్డు సందర్భంగా కలకత్తాలో ఉంటున్నా మని చెప్పాను) .... అయితే, 31 మధ్యాహ్నం మూడుగంటల దాకా మాయాపుర్ నుంచి రాలేకపోవటం, నేషనల్ లైబ్రరీ ప్రభాకరరావుగారికి మేమా రోజు తప్పకుండా వస్తామని మాట యిచ్చి వుండటం వల్ల, సుర్జిత్ ఘోష్‌ని మళ్ళీ క లు సు కో లే క పోయాను ; ఫోన్ చేయలేక పోయాను ; ఆశాపూర్ణాదేవి, కవితా సిన్హాలని చూడలేక పోయాము.

. . . . . 22

చెరువు ఆంజనేయ శాస్త్రి దివం గతులై ఏడాదయింది.... 'వీరి నాటి కలలో మానవ స్వభావం దర్పణ న్యాయంలో ద్యో త క మ వు తుం ది, పోలీసు పాత్రలపట్ల చెరువు వారికి ప్రత్యేకాభిమానం' - అన్నారు లలితా పీటర్స్ 'నాటికల సంకలనం' పరి చయం. చేస్తూ వీటిలో చాలా భాగం రేడియో ప్రసారితాలు. పొట్టి శ్రీ రాములు హాలులో జరిగిన ఈ సభకు గ్రంథావిష్కర్త జగ్గయ్య; అధ్యక్షులు భమిడిపాటి రాధాకృష్ణ ; ఈ సమా వేశ కారణంగా ఒక సన్మిత్రుని విరు హాసవదనం అందరి మనసుల్లో మెదిలింది.

. . . . . 25

రాత్రి హౌరామెయిల్‌లో కల కత్తాకు. విశాఖలో ప్రసూన లంచ్ కారియర్, శోభా, చిట్టీ పట్టుకొచ్చిన చపాతీలు, సాండ్ విచెస్, స్వీట్స్, సుందరీరావు రాత్రి తినడానికని యిచ్చిన యిడ్లీలు - మేమిద్దరమే కాదు ; మరో ముగ్గురు తినవచ్చు అంకుల్ అంటీల కోసం శోభ ఫిల్టర్ వాటర్ తీసుకొచ్చింది తమ యింట్లో నుంచి. సుందరీరావు మాతోబాటు కలకత్తా వస్తున్నారు - ఆమె మరొక బోగీలో ఉన్నారు. 27 ఉదయం హౌరా స్టేషన్‌కి ఖాన్, సుకుమార్ - యిద్దరు డ్రయివర్లూ వచ్చారు. నిజామ్ పాలెస్ క్వార్టర్స్ - థర్డ్‌ఫ్లోర్ - శివ స్వామి దంపతుల ఫ్లాట్.... వేడి వేడి. కాఫీ, గుట్టల కొద్దీ కబుర్లు. అవి ఈ 'డైరీ'లో మూడు ముక్కలలో చెప్పేవి కాదు. స్థిమితంగా, వివరంగా తర్వాత చెబుతాను.... భారతీయ భాషా పరిషత్తు గురించి మాలతీ చందూర్ 'హృదయ నేత్రి' అవార్డ్, పరిషత్తు వారి సెమినార్, కలకత్తా ఆంధ్ర మహా సభ, మాయాపూర్ విజిట్ స్వామీ ప్రభుపాద ఇస్కాన్, అతిథిగుణ, గురుకులమ్, నేషనల్ లైబ్రరీలో రెండో తేదీ రాత్రి కవేరీ రోడ్ చేరుకొనేదాకా ఈ వారం రోజుల కథ Another Week in West Bengal తర్వాత చెబుతాను.

—యస్వార్ చందూర్

## సమీక్ష

# చిత్రజగతి

### దేవీవారి
## ఘరానా మొగుడు

ఈ మధ్య రౌడీలూ, మొగుళ్లూ తెలుగు సినీ ప్రపంచాన్ని బాగా అకట్టు కుంటున్నారు..... ఉమాదేవి భర్తగా మసులుకోవడానికి అంగీకరించని కథానాయకుడు (చిరంజీవి), రాజు భార్యగా నడుచుకోవడానికి యిష్టపడని కథానాయిక (నగ్మా), పోరాటాన్ని, నాటకీయతని సృష్టిస్తారు. యూని యన్‌ని దెబ్బకొట్టేందుకు, యూనియన్ నాయకుణ్ని పెళ్లిచేసుకోవడమనే ఉన్మాద చర్య సినిమాలలోనే జరుగు తుంది. ముంచేతి చర్మం కోసుకు, రక్తపు బొట్టు చిందించి, రాజు తల్లిని తన ప్రేమ ఎంత ప్రగాఢమైనదో వంచనతో నమ్మింప బూనడం, పక్ష వాతంతో చచ్చుబడ్డ చేతికి ఆ క్షణాన జీవం రావడం, తత్కారణంగా రాజు ఈ పెళ్లికి వొప్పుకోవడం, మాతృ భక్తికి నీరాజనం. అప్పటికే భవానితో (వాణీవిశ్వనాథ్) ఫ్రెండ్లీగా వున్నప్ప టికీ, ఆమె యితనిని తన మనోనాథు నిగా ఊహించుకుంటున్నప్పటికీ, తనకితానై వచ్చిన ఉమాదేవి విషయం లో తల్లి మాట ఉల్లంఘించిలేక పెళ్లి చేసుకుంటాడు. అయితే ఉమాదేవి మొదటి రాత్రే తన అహంభావంతో తూలనాడి, ధనగర్వ, విజయగర్వాల ప్రదర్శన గావిస్తుంది. అతను వర్క ర్లలో ఒకడు; ఈమె యజమాను రాలు. మూడు ముళ్లూ పడ్డాయి గాని, ఏ ముచ్చటా లేదు - కాగా, ఇద్దరు లలనా మణుల స్వప్న వృత్తాంతాలతో కావలసినంత కేళీ వినోదం. ఉమాదేవి మోటారు సైకిళ్ల కంపెనీని సర్వనాశ నం చేయాలనే వైరివర్గం ఒకటి ఉంది (ఈమె తండ్రి రావుగోపాల రావు; వైరివర్గ నాయకుడు సత్య నారాయణ; భవాని తండ్రి సాక్షి రంగారావు). భార్య భర్తల పేచీ, వర్కర్లూ యాజమాన్యం తగాదా డబుల్ ట్రాక్‌లా నడుస్తూంటాయి. టిన్ను పెట్రోలు పోసి వెర్రి ఆవేశంలో పెద్ద కారు తగల బెట్టిన యజమాను రాలు; ఇన్సురెన్స్‌క్లయిమ్‌తో కొత్త కారు కొనుక్కుంటుంది గాని, అద నులో వైద్యం జరగకపోతే, నారాయి చెయ్యి మొలవదు - అనే ఈ రాజు, తల పొగరు గల తరుణీమణి కళ్లు తెరి పిస్తాడు. దర్శకులు: రాఘవేంద్ర రావు; నిర్మాత: దేవీ వర ప్రసాద రావు.

డీలక్స్

ఇప్పుడు
ఆకర్షణీయమైన రంగులో లభిస్తుంది.




మీ శిశువుల మధ్య ఎడం ఉంచడానికి
సరైన సాధనం.

davp 91/636 Telgu

'ముందున్న జీవితం' - 'Life Ahead' - జె కృష్ణమూర్తి ఆలోచనా స్రవంతి. తెలుగు అనువాదం: సరోజినీ ప్రేమ్‌చంద్. ప్రచురణ : కృష్ణమూర్తి ఫౌండేషన్ - ఇండియా, 64, గ్రీన్ వేస్ రోడ్, మద్రాసు-28... వెల రు. 60-00.

ప్రధానంగా విద్యార్థులని ఉద్దేశిస్తూ చేసిన ప్రసంగాల సంపుటి యిది. విద్యార్థులూ టీచర్లే గాక తెలుసుకోవాలనే ఆసక్తి కలవారందరికీ యిది ఉపయుక్తం. అరవై సంవత్సరాల పాటు ప్రపంచంలోని పలు దేశాలు పర్యటించి, నవమానవ ఆవిర్భావం 'గురించి వక్కాణించిన తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి. "'సత్యం' అనేది బాట లేని చోటు. పూజా పునస్కారాలు, మత విశ్వాసాలు, కఠోర నియమాలు, గురుపాద పూజ - యిలాటివేవీ అక్కడకు తీసుకు వెళ్లవు. చుట్టూ ప్రపంచంతో ఏర్పడే సంబంధ బాంధవ్యాల నిరంతర మనో విశ్లేషణే సత్య పథానికి దారి చూబుతుంది" - అంటారు కృష్ణమూర్తి. సమాచార సేకరణతో, విజ్ఞాన సముపార్జనతో మనమెంతో నేర్చుకుంటున్నామనే అపోహలో ఉంటాం. అది నేర్చుకోవడం కాదు. మనకు తెలిసినది మనలో అంతర్భూతమై నిర్ణయ జ్ఞానానికి దోహదకారి అయినప్పుడే, దానిని నేర్చుకోవడంగా భావించవచ్చు. మనసు వికసించేందుకు ఏకాంతత కూడా ఒక సాధన మార్గం. పువ్వుకీ, తావికీ తేడా లేకపోవడం లాటిది ప్రేమ భావం.... అసంతుష్టి ఒక అగ్నిజ్వాలలాగా, తృప్తిపడట మనే చీడను కాల్చివేస్తుంది - అంటారు జెకె. పై మనసు, లోని మనసు పేచీ పడుతూ రాజీ పడుతూ, ఘర్షణలో స్వీయానుభవాల్ని ముంచెత్తుతాయి ; ఆ ఘర్షణ, ప్రాజ్ఞతని వికసింపజేస్తుంది.

మొదటి భాగంలో 19 అధ్యాయాలు, రెండవ భాగంలో 4 అధ్యాయాలు వున్నాయి. వీటిలోని ప్రశ్నల సూచిక పుస్తకం చివరని వుంది. కలిగిన ప్రశ్నని బట్టి ఆ విషయమై జెకె అభిభాషణ ఏ విధంగా ఉన్నదీ పేజీ నెంబరుతో తెలుసుకోవచ్చు. 'సంతోషంగా జీవించాలి అంటే ఏంచేయాలి? దైవం అంటే స్త్రీయా, పురుషుడా ? దైవాన్ని కనుక్కోడానికి అతి సులువయిన మార్గం ఏది ? లోకంలో దుఃఖం, బాధ ఎందుకు వున్నాయి ? ప్రేమ కలగడానికి ఆకర్షణ

ఆధారం కాదా ? మతం అంటే ఏమిటి ? సౌందర్యం వస్తుగత మయినదా, మనోగత మయినదా ? సత్యం సాపేక్షికమా ? జీవితంలో ఆదర్శాలు వుండటం ముఖ్యంకాదా ? భయరాహిత్యం ఏ విధంగా సంపాదించగలుగుతాం ? నూతన ప్రపంచం అంటే ?' .... ఇటువంటి ప్రశ్నలు కలగని దెవరికి ? వీటిని జిడ్డు కృష్ణమూర్తి తరిచి, తర్కించి, వివరించి, మీ మనో కవాటాలు తెరుచుకు చూడమంటారు.

సంతోషంగా జీవిస్తున్నప్పుడు మీకు ఆ విషయం తెలియదు - బాధ పడుతున్నప్పుడు తెలుస్తుంది.... జీవితం మీ చేతిలో వుంది, దానిని మీరు ఏం చేయదలుచుకుంటే అదే జీవిత గమ్యం, జీవిత లక్ష్యం.... ప్రేమ భావం లేని జ్ఞానం మన వినాశనానికి కారణమవుతుంది - ప్రస్తుత ప్రపంచంలో జరుగుతున్నదియిదే.... ఈర్ష్య వినాశకారి.... ప్రేమభావం వున్నప్పుడు మాత్రమే శాంతికలుగుతుంది... పరిసరాలు అంటే, దేశపు ఆర్థిక, మత, జాతీయ, వర్గవాతావరణంతో పాటు శీతోష్ణస్థితి కూడా.... సృష్టించడం ప్రకృతి చేసేది, సృజించడం మనిషి చేసేది.... ఇలా పాఠకుని ఆలోచింపజేసే వివరణాత్మక సమాధానాలతో, భావస్ఫోరక ముఖ చిత్రంతో, చక్కటి ప్రింటింగ్‌తో వెలువరించిన ఈ 292 పేజీల పుస్తకం, దైనందిన జీవితం యాంత్రికం గాక చైతన్యవంతమయే అంతర్వీక్షణ నేర్పుతుంది. జిడ్డు కృష్ణమూర్తి తత్త్వసారంలో ఆధ్యాత్మికత, మతమూ ఉండవు. అలవాట్లగాడిలో పడక, మనసుని 'నిత్యవసంతం' మాదిరి కాపాడుకోమంటుంది.

అనువాదకులు సరోజినీ ప్రేమ్ చంద్, ఆంగ్లంలో సైతం క్లిష్టతరంగా ఉండే విషయాన్ని, చక్కటి తెలుగు నుడికారంలో నేటి పాఠకుని మనసుకి హత్తుకొనే రీతిని, ఎంతో సరళంగా, హృద్యంగా, అభినందనీయంగా చెప్పారు.

—క్షీరసాగరమ్

పోతుకూచి కథలు.... పోతుకూచి సాంబశివరావు. జనచైతన్య ప్రచురణలు - 6-3-195 న్యూబోయగూడా, సికిందరాబాదు-3.... వెల రు. 4-00.

ఈ సంపుటిలో నాలుగు కథలున్నాయి. ఇది మామూలు కథల సంపుటాల కన్నా భిన్నమైంది. కథా సంపుటాలకు మార్కెట్టు తగ్గిన కారణంగానూ, పుస్తకాల ధర, సామాన్యులకు అందుబాటులో లేకపోవడం వల్లా, ఈ లాటి మార్పు ప్రవేశ పెట్టినట్టు రచయితే చెప్పుకున్నారు.

ఫలించని ప్రేమలో చిక్కిన అతివ దయనీయగాథ 'గోదావరి గట్టు'.

'బస్సులో పది నిముషాలు'లో పాత్రలతో పాటూ మనమూ హాయిగా కాస్సేపు బస్సులో వెళ్ళొస్తాము.

ఈ కథలన్నీ తెలుగు వారి సహజ జీవిత పరిస్థితుల్లో మలచబడ్డవి.

—అన్నపూర్ణా రెడ్డి

సైన్స్ ఫిక్షన్

# జూలియస్

## అన్నపూర్ణా రెడ్డి

### ముందుమాట

అన్నపూర్ణా రెడ్డి దంపతులు 1974 లో అని జ్ఞాపకం, అమెరికా నుంచి వస్తూ, మద్రాసులో ఒక రోజు ఆగి, మమ్మల్ని చూడటానికి వచ్చారు. ఆయన బాపట్ల అగ్రికల్చరల్ కాలేజీలో ప్రొఫెసరు: ఆమె గుడివాడ కాలేజీ నుంచి పాసైన హొమియోపతీ డాక్టరు. ఇద్దరూ ఉత్తములు, నెమ్మదస్తులు; స్నేహానికి ప్రాముఖ్య మిచ్చే సజ్జనులు; వైజ్ఞానిక దృక్పథం గల ప్రగతి శీలురు.... కబుర్లూ కాఫీలూ అయాక, ఆ సాయింత్రం వారు బాపట్ల వెళ్లిపోయారు..... అయిదారు నెలలు గడిచాక, పోస్టులో ఒక బండిల్ వచ్చింది - ఆ నవల పరిశీలించమనే అభ్యర్థనతో.... 'మీరు చెప్పదలుచుకున్నది బావుంది - భాష సాఫీగా ఉంది. అయితే, చెప్పే పద్ధతిలో కొంత మార్పు ప్రవేశ పెడితేగాని, పాఠకుని మనసుకి హత్తుకోదు' - అని వ్రాశాను... ఒకసారి విజయవాడలో ఉండగా, ప్రొఫెసర్ రెడ్డి వచ్చి, వాళ్ల కాలేజీ వెహికల్‌లో నన్ను బాపట్ల తీసుకువెళ్లారు. ఆమెలోని సారస్వత పిపాస పట్ల ఆయన కెంతో ఆదరమూ అభిమానమూను.... ఆ రాత్రి భోజనాలయాక తొమ్మిది నుంచి ఒకటిన్నర రెండుగంటల దాకా, తాను సృష్టించిన పాత్రల గురించి ఆమె సవివరంగా చెబుతూండటం, నేను అవి ఎక్కడ అస్వాభావికంగా ఉన్నదీ. విమర్శిస్తూ ఎలావుంటే సహజత్వం చేకూరేదీ చెప్పడమూ, రెడ్డిగారు ఈ వాదప్రతివాదాలు సావధానంగా వింటూ

కూచోవడమూతో గడిచింది. అన్నపూర్ణారెడ్డి చాలా పట్టుదల మనిషి - 'స్ట్రాంగ్ - విల్‌డ్ పెర్సన్.' అయితే, 'వోపెన్‌డ్‌మైండ్' గల వ్యక్తి. హేతుపుని, హితువుని స్వీకరిస్తారు... ఈ నాలుగైదు గంటలలో ఒకసారి ఫ్రూట్ సలాడ్, ఒకసారి హాట్ టీ (ఆమె కాఫీ, టీలు పుచ్చు కోరు) అతిథి మర్యాదగా! మధ్య మధ్య 'లైటర్ వీన్'లో కబుర్లు. చివరికి నేను ఏమి చెప్పానంటే : 'ఈ మూడు వందల పేజీల కట్ట ఒక మూలపెట్టి, ఇప్పుడు మనం మాట్లాడుకున్న ప్రకారం, కొత్తగా రాయండి. ఆ వ్రాసి నది నాకు పంపితే, నాకు తోచిన మార్పులు చేసి, మా చిన్న పత్రికలో ప్రచురిస్తాను' - అన్నాను, ఎప్పుడు? 1975 ద్వితీయార్ధంలో కావచ్చు... రచయితలు సాధార ణంగా, ఒకరు చెప్పడమూ మనం వినడమూనా, మనం సృష్టించుకున్న ముద్దుపాపల (పాత్రలు) లోపాలెం చేందుకు వారెవరు? - అనుకుంటారు.... నా సూచనలు అంత సీరియస్‌గా తీసుకు, ఆమె తిరిగీ వ్రాస్తారని నేను అనుకోలేదు... వ్రాశారు... అయిదారు నెలల్లో ఒక సరి కొత్త నవల నా టేబుల్ మీద కొచ్చింది.... నేను చెప్పి నది కొంత పాటిస్తూ, తన వరవడిలో వ్రాశారామె. మొత్తంమీద బావుంది - రీడబుల్. 1977 జనవరి నుంచి 'భానూ'... 'సీరియల్‌గా వెలువడింది 'జగతి'లో. 1978 లో ఆమె మళ్లీ అమెరికా వెళ్లారు - అప్పట్లో రెడ్డిగారు అక్కడ వున్నారు. ఈ రెండో ట్రిప్ అయాకనే, మాజీ అమెరికన్ అధ్యక్షుడు జిమ్మీ కార్టర్ వ్యవసాయ క్షేత్రంలోని 'వేరుశనగ' ప్రాశస్త్యం గురించి మాకు చెప్పారు ప్రొఫెసర్ రెడ్డి.... అన్నపూర్ణా రెడ్డి అమెరికా నుంచి 'జగతి'కి వ్రాసిన లేఖ చదివి, 'ఎవరండీ ఈమె? ఎక్కడుంటారు' అని అడిగారు దాశరథి. 'మీ హైదరా బాదులోనే - రాజేంద్ర నగర్‌లో (అగ్రికల్చరల్ యూని వర్సిటీ). వీలైతే ఒకసారి అటు వైపు వెళ్లండి - మిమ్మల్ని

చూసి ఆనంద పడిపోతారు ఆ దంపతులు' - అన్నాను.. 1980 జులై నుంచి 'ఇంద్రధనుస్సు' అని ఒకొక సీరియల్ వెలువడింది 'జగతి'లో.. 1981 అక్టోబరు నుంచి 'నెలవంక విరునవ్వు'. మనిషి కాదు, విరంజీవి, అంతర్గతం వంటి కథానికలు ఈ చిన్న పత్రికలో వదెవి, ఒకసారి విద్వాన్ విశ్వం, "అన్నపూర్ణారెడ్డి 'జగతి'కి తప్ప యింకే పత్రికకు వ్రాయరా ?" అని అడిగారు. 'అదేమీ లేదండీ-మీరు వేస్తానంటే ఎందుకు రాయరూ? - అన్నాను..., ఆంధ్రప్రభ వీక్లీలో ఆమె కథలు' కొన్ని స్వంత పేరుతోను, కొన్ని ప్రెన్‌నేమ్‌తోను వెలువడ్డాయి... 1983 సెప్టెంబరు నుంచి 'కోణార్క్', 1985 జనవరి నుంచి 'ఆనంది' 1989 సెప్టెంబరు నుంచి 'మజిలి' మన 'జగతి' వెలువడ్డాయి... 'మజిలి'లో చేసిన మార్పుకి, ఆమె మొదట్లో కాస్త కినుక చెంది, ఆపైన సర్దుకున్నారు... ఈ 'జూలియస్' నవల ఆమె 24-8-89 ముగించి, నవంబరు 21వ తేదీన 'జగతి' కి పంపారు... 'ఇది మామూలు నవల కాదు - మీరు చదివి మీ అభిప్రాయం తెలుపుతారని పంపిస్తున్నాను. శ్రమ కలిగిస్తున్నందుకు మన్నించండి. అచ్చుమాట ఎలావున్నా స్టోరీని "లాక్కొచ్చిన విధం పరిశీలించమని...' అంటూ ఒక పెద్ద ఉత్తరం వ్రాశారు... స్థలాభావంవల్ల యిన్నాళ్లూ ఈ సైన్స్‌ఫిక్షన్ పాఠకుల ముందు వుంచలేక పోయాను ... రెడ్డి దంపతులకు ముగ్గురు పిల్లలు. పెద్దబ్బాయి రవీంద్ర అలహాబాదులో చదువుతున్నాడు - మిగతా యిద్దరూ మదనపల్లి బోర్డింగ్ స్కూలులో. తిరుపతి నుంచి రిటైరవబోతున్నప్పుడు ప్రొఫెసర్ రెడ్డి, తమ జీవితాన్ని విహంగ వీక్షణం గావిస్తూ వ్రాసిన ఉత్తరం, అస్తారు పదంగా దాచుకున్న అమూల్య లేఖా సంపదలో ఒక మణిపూస. ప్రస్తుతం ఆయన బెంగుళూరు సమీపానున్న 'నేల మంగళం'లో సైంటిఫిక్ అడ్వయిజర్. మా

దొడ్లో ఆయన స్వయంగా నాటిన కొబ్బరి మొక్క తీవిగా పెరిగి, మేము పంచిపెట్టేటన్ని కొబ్బరికాయల నివ్వడం, ఆ దంపతుల ప్రేమాభి మానాలకు మచ్చుతునక... అన్న పూర్ణా రెడ్డికి పేరు ప్రఖ్యాతుల మీద ఆశలేదు. తన మనసులో వున్నది పదిమందికీ చెప్పాలనే తపన ఒక్కటే- ఆ తపన తీరడంతో ఆమె తృప్తి జెందుతారు. తనకు తెలియని ప్రదేశాలు, తెలియని స్వభావాలు జోలికిపోరు. తెలిసినది సరళంగా, స్పష్టంగా, సుమనోహరంగా చెబు తారు... చాలా పెద్ద ఉపోద్ఘాతం - యిక, అసలు కథ లోకి వెళ్దాం.

—ఎడిటర్

## 1

డిసెంబరు మాసం.

వేకువఝాము చలి గజ గజ లాడిస్తోంది. ఢిల్లీ నుండి నైనిటాల్ వెళ్ళే బస్సు ప్రయాణీకులతో కిట కిట లాడుతోంది.

ఉలెన్ మంకీ కాప్, పుల్ వోవర్, ఉలెన్ కోటు పేంటు... గ్లౌజ్... ఫుల్ షూ శరీరాన్నంటి పెట్టుకొని వెచ్చ దనాన్నిస్తున్నా రాజేష్ పళ్లు టకటక లాడుతూనే వున్నాయి.

ఏకాగ్రతతో ముందుకు చూస్తూ జాగ్రత్తగా బస్సును నడుపుతున్నాడు డ్రైవరు.

సిగరెటు వెలిగించుకుంటే బావుణ్ణ నిపించినా 'నో స్మోకింగ్' సైన్ గుర్తొచ్చి ఆ ఆలోచన విరమించు కున్నాడు రాజేష్.

ఉదయం ఆఫీసుకు ట్రంక్‌కాల్ చేసి మరీ చెప్పాడు. డాక్టర్ మల్హోత్రా 'యాజ్ యూ జుయల్ ఫేర్‌వెల్ టు ది అవుట్ గోయింగ్ యియర్ అండ్ వెల్‌కమ్ టు ది న్యూయియర్ 'కేజల్ లోలిటా'లో సెలిబ్రేట్ చేసుకొంటు న్నాం మనం - ఆనంద్ నుండీ డాక్టర్ షార్మాకూడా వస్తున్నాడు. ఆ మాటే నీకు లెటర్‌లో రాశాను. ఉత్తరం అందినా అందకపోయినా, దిస్ ఈజ్ మై పర్సనల్ ఇన్విటేషన్ టు ఎ వెరీ పర్సనల్ ఫ్రెండ్' అంటూ...

'థాంక్స్ డాక్టర్ మల్హోత్రా... కానీ థర్టీ ఫస్ట్ ఇంకా నాలుగు రోజులుంది. ఇప్పట్నుంచీ ఎందుకు? ఒక్కరోజు ముందొస్తే చాలదూ'... అన్నాడు రాజేష్.

'నో... రాజేష్ భయ్యా... ఈ దఫా మనతోపాటూ మా నీస్ మిస్ సునీతా కూడా వుంటోంది... తనకు ఇక్కడ బోర్‌గా ఫీల్ అవకుండా మనమంతా కంపెనీ ఇవ్వాలి...'

'బట్ మల్హోత్రా... ఇక్కడ కంపెనీ వ్యవహారాలూ అవీ!'

'ఓః్హ రాజేష్... ఫరగెట్ ఎబౌట్ దట్. అవి ఎప్పుడూ వుండేవేగా... నాలుగు రోజులకి ఏం మునిగిపోవు గానీ వచ్చేసేయ్... ఎల్లుండి కాదు... కాదు.... రేపు ఉదయం నుండీ టిల్ యువర్ ఎరైవల్... నైనిటాల్ బస్ స్టేషన్‌లో కారుతో ఎదురు చూస్తూం టాడు మా డ్రైవరు... అన్నట్టు మిసెస్ రాజేష్‌ను వెంట బెట్టుకు రావడం మర్చిపోకేం...'

''డాక్టర్ మల్హోత్రా... మిసెస్ రాజేష్‌కు క్రికెట్ క్రేజ్ అని నీకు తెలుసు. టెస్ట్ మాచెస్ చూడ్డంలో ప్రస్తుతం ఆమె మునిగి వుంది. తని ప్పుడు బొంబాయిలో వుండి వుంటుంది ..,నా వరకు తప్పక వస్తాను.''

'ఒకె... సీయూ...' లైన్ కట్ అయిపోయింది...

బస్సు కుదుపులకు ఆలోచనలు విర మించుకొని, అద్దాల గుండా దృష్టి బైటకు సారించాడు. పంత్‌నగర్ సమీపిస్తున్నట్టు, దూరాన పొగ మంచు పొరల మాటున, కాంతులను మసగ్గా చిమ్ముతున్నాయి విద్యుద్దీ పాలు.

మరి కాస్సేపటికి టర్మినస్‌లో బస్ ఆగింది. బస్సు దిగేవాళ్లు పెద్దగా లేక పోయినా ఎక్కేవాళ్లతో ఖాళీ సీట్లన్నీ నిండిపోయాయి.

గరమ్ గరమ్ మసాలా చాయ్ తాగి, తనివి తీరా సిగరెట్ కాల్చు కొని, గుండెలనిండా పొగపీల్చి, ఈజ్ చేసుకొని, తన సీటులో కూర్చున్నాడు రాజేష్.

దట్టమైన పొగమంచు, లైట్ల వెలు తుర్లో ఒక్కొక్కవ్యక్తి స్పేస్ నుండీ దిగి వచ్చినట్టు గమ్మత్తుగా అనిపిస్తున్నారు. తెలతెల వారబోతుంది... గగన మార్గాన సుదీరతీరాల్లో అవిరళంగా ప్రకాశించిన నక్షత్రాలు తమ కాంతి కగ్గి, వెలాతెలా పోతున్నాయి.

సం వ త్స రా ని కొక్కసారి... అందునా పాత సంవత్సరానికి వీడ్కోలు, క్రొత్త సంవత్సరానికి ఆహ్వా నం, ప్రకృతి రమణీయతకు అందెవేసిన కుమవాన్ పర్వత పంక్తుల మధ్య... అందాలను చర్మచక్షువులతో తనివి తీరా గ్రోలుతూ! సంవత్సరం పొడ వునా బిజినెస్ గొడవలతో తల మునకలై వేడెక్కి పోయిన బుర్రకు శరీరానికి నిజమైన విశ్రాంతి దొరికే సమయం అదే! అందుకే ఎంత బిజి నిస్ గొడవలో తలమునకలై వున్నా డాక్టర్ మల్హోత్రా అహ్వానాన్ని అంగీ కరించి రెక్కలు కట్టుకు ఎగిరివచ్చే స్తాడు రాజేష్.

'కాత్ గోడెం' దగ్గర రైలు మార్గం అంతమై పోయింది. బాటకిరు వైపులా కొనిఫెరస్‌ట్రీస్ నిండు ఆకు పచ్చరంగులో నిలబడి 'హలో'.... అన్నట్టున్నాయి బస్సు 'హల్దవానీ' చేరింది.

అక్కడ డ్రైవర్ మారిపోయాడు. ఘాట్ రోడ్ మీద బండి నడపడానికి లైసన్స్ వున్న డ్రైవర్ వచ్చి సొద

రంగా అందరినీ 'హల్లో' అంటూ పలుకరించి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

ఒక్కో మలుపే తిరుగుతూ, ఒక్కో మెట్టూ ఎత్తుకు, ఎక్కుతూ బస్సు, పూల రథంలా ముందుకు పోసాగింది.

మలుపుల్లో బస్సు అటూ ఇటూ ఒరుగుతూంటే పేసింజర్లూ ఒకరి మీద కొకరు వారుగుతూ అలాగే జోగుతున్నారు.

నిద్రలేమితో కళ్లు మండుతున్నా అలాగే చూస్తూ కూర్చున్నాడు రాజేష్. హల్ద్వానీ నుండీ ఫుట్ హిల్స్ ఆఫ్ కుమవాన్ పంక్తుల్లో పయనించే బస్సు ప్రయాణమంటే రాజేష్‌కు ఎంతో ఇష్టం.

ఓ వైపు అగాధాల్లాటి లోయలు, మరోసారి అప్పుడే అధిరోహించి వచ్చిన రోడ్డు.... మరో ప్రక్క ఎత్తయిన పర్వతశ్రేణి, వద్దనుకున్నా ప్రతి మలుపులోనూ పలుకరించే 'రామ గంగ' పాయల గలగలలు....

విడిపోతున్న మంచు.... చూసుకు వచ్చి పలుకరించే రవి కిరణాలు.... అక్కడక్కడ రోడ్డు ప్రక్కన చాయ్ దుకాణాలు.

రాణిఖేత్ దాటేసింది బస్సు.

షార్మా అని పిలువబడే కాంతి షార్మ గుర్తొచ్చాడు.

డా॥ కాంతిదేవ్, దేవ్ షార్మ గుజరాత్‌లోని ఆనంద్‌లో స్వంత డైరీ ఫార్మింగ్ చేస్తున్న వెట్ డాక్టర్. ఎప్పుడూ హైక్వాలిటీ మిల్క్ ప్రొడక్షన్ అంటూ... హైబ్రిడ్ బఫెలోస్, 'కౌస్' అంటూనో ఎదుటివాళ్ళను డైరీ ఫార్మింగ్ మీద ఇట్టే ఇంటరెస్ట్ కలిగేలా చెప్పకు పోతాడు. లేట్ ఫార్టీస్‌లో వున్నా ధర్టీస్ లోలాగ వుంటాడు

మల్హోత్రా, షార్మా, రాజేష్‌లు ముగ్గురు. హైస్కూలు, కాలేజీ రెండేళు హైదరాబాద్‌లో కలిసే చదివారు.... రాజేష్ బొటనీలో డిగ్రీ చేసినా 'స్పెషల్ పాసిక్స్'.... అనే ఇండస్ట్రీ హైదరాబాదులోనే స్థాపించి చేయి కాల్చుకొంటూంటే....

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004.

డాక్టర్ మల్హోత్రా. కొంతకాలం గవర్నమెంటు సంస్థలో పనిచేసి. నైని టాల్‌లో స్థిరపడి స్వంత ప్రాక్టీస్‌లో మునిగిపోయాడు. నైనిటాల్‌కు ఐదు కిలోమీటర్ల దూరంలో కొండల మధ్య....మైదానంలో 'కేజిల్ లొలిటా' కట్టుకొని.... నివాసం అక్కడికి మార్చుకున్నాడు. బట్టతల, గుండ్రటి ముఖం.... అంతకన్నా గుండ్రటి మెరిసే కళ్లలో.... తెల్లబడి పోతున్న గడ్డాన్ని రెండంగుళాలు వదలి నీట్‌గా ట్రిమ్‌చేసి దాన్ని గ్రూమ్ చేయడం అతని హాబీల్లో ఒకటి.... ఫుల్ సూటులో హమేషా పైప్ కాల్చుతూ... ఆ ఆరోమాతో నిండిన నోటితో... స్నేహభావం వెల్లివిరిసే నవ్వులు వెద జల్లుతూ.... కొండల చల్లదనానికి మరింత నిగుతేలి ఉక్కుకడ్డీలాటి శరీర సౌష్టవంతో.... ప్రొఫెషన్‌కు తగ్గట్టు మంచిపేరు తెచ్చుకొని.... అందరికీ ప్రాణదాతగా నిలిచి పోయాడు.

ఆ ముగ్గురి మిత్రుల ప్రొఫెషన్స్ వేరైనా, వారి స్నేహం ఏళ్లు గడిచే కొద్దీ తీగెలు సాగుతూనే వుంది. పందిర అల్లుకొని పటిష్టమై నిలి చింది. దాదాపు గత పది సంవత్స రాలుగా ప్రతి ఏడాది ఆఖరులో మిత్రులు ముగ్గురూ కాజిల్ లొలిటాలో కలుసుకొని కులాసాగా కబుర్లు చెప్పు కొనేవారు.....ఆ నాలుగు రోజులూ నాలుగు క్షణాల్లా గడిచిపోయేవి.

బస్సు నైనిటాల్ బస్ టర్మినస్‌లో ఆగింది.... రాజేష్ సూట్‌కేస్ అందు కొని క్రిందకు దిగి నిలబడ్డాడు. మెడ సవరించుకొంటూ అటూ ఇటూ చూచే లోగా తెల్లని యూనిఫామ్‌లో వున్న డ్రైవర్ పరుగెట్టుకొచ్చి.... సెల్యూట్ కొట్టి 'మీ కోసమే ఎదురు చూస్తు న్నాను. రండి రండి'.... అంటూ సూట్‌కేస్ అందుకున్నాడు.

"హలో రామ్‌దీన్.... డాక్టర్ సాబ్ ఎలా వున్నాడు.... నీవు బావున్నావా?" కుశల మడిగాడు రాజేష్.

ఉచిత రీతిని బదులిచ్చి ముందుకు నడిచాడు డ్రైవర్.

హాలీ డేయర్స్‌తో కిటకిట లాడు తోంది బస్ స్టేషన్. చలి నెవ్వరూ లెక్కచేయడం లేదు.... అందరి ముఖాల్లో ఉత్సాహం, ఆనందం ఉర కలు వేస్తోంది. వాళ్లందరినీ కలియ జూస్తూ ఓమారు సరదాగా తలవి దిల్చి కర్చీఫ్‌తో ముఖాన్ని మరో మారు తుడుచుకొని సైడ్ పాకెట్ నుండీ దువ్వెన తీసి ఉంగరాల జుట్టును దువ్వుకొని కారు సమీపించాడు.

డిక్కీలో సూట్‌కేస్ వుంచేసి బ్యాక్ డోర్ అన్‌లాక్ చేసి, డోర్ తీసి పట్టు కున్నాడు రామ్‌దీన్.

లేత ఛాక్‌లెట్ కలర్‌లో వున్న సరి కొత్త వోక్స్ వేగన్ అది. కార్లపట్ల మిత్రుని అభిరుచిని మనసులోనే అభి నందించుకొంటూ కార్లో కూర్చు న్నాడు. కారు నెమ్మదిగా ముందుకు కదిలింది.

నైనిటాల్ లేక్ ప్రక్కగా మాల్ రోడ్ మీద కాస్తదూరం వెళ్ళి,

అక్కడ టర్న్ తీసుకొని, కాజిల్ లొలిటా దిశగా నెమ్మదిగా పోనిచ్చాడు రామ్‌దీన్.

టౌన్‌షిప్ అయిపోగానే.... క్రమతో కట్టిన ఇళ్లు అక్కడొకటీ ఇక్కడొకటీ అవుపిస్తూ.... పోనుపోను అన్నీ పంట పొలాలు.... చిన్నచిన్న షాప్‌డీలు పలుకరించాయి.

రోడ్డు అంతమైపోయి, కచ్చరోడ్డు మీదకు మళ్ళింది కారు. పచ్చని చెట్ల మధ్య దూరాన్నుండే పలుకరించింది కాజల్ లొలిటా. ఓ వరస ఇటుక, లోపల ఉడెన్ పానలింగ్‌తో అత్యాధునికంగా కట్టిన రెండంతస్తుల భవనం కాజిల్ లొలిటా.

ఒకసారి నెమ్మదిగా హారన్ ఇచ్చి, ఇనుపగేట్ల గుండా కంకర రోడ్డుమీద దొర్లుతూ వచ్చి గుమ్మం ముందు ఆగింది.... ఓక్స్ వేగన్.... ఇగ్నిషన్ కీ ఆఫ్ చేసి క్రిందకి దిగేసరికి.... ఓ మూలనుంచొని బీడీ కాచ్చుకుంటున్న పనివాడు పరుగెట్టివచ్చి డిక్కీలోని సామాను చేతికందుకున్నాడు.

రాజేష్.... మెట్లెక్కి వరండాలోకి వచ్చేసరికి బ్లు స్లవ్‌లెస్ బ్లు స్వెట్టర్.... మేచింగ్ స్ట్రెచ్‌పేంట్సు.... తొడిగి, భుజాల మీద వాదిగి కూర్చున్న బాబ్డ్ హెయిర్‌తో సింహ ద్వారం దగ్గర నిలబడి నమస్తే అంకుల్ రాజేష్.... అంది చిరపరిచితురాలిలా.

ఇరవయి సంవత్సరాలకు ఒకటి అటో ఇటో వున్న ఆ అపరిచిత యువతి పలకరింపుకు మొదట తత్తరపాటు చెందినా, సర్దుకొని 'యు ఆర్ మిస్ సునీత యామై కరెక్ట్' అన్నాడు రాజేష్.

'ఎస్.... ఐ యామ్ మిస్ సునీతా'.... అంది నవ్వుతూ. – సంభాషణ స్వచ్ఛమైన ఇంగ్లీషులోనే జరిగింది.

'వెల్‌కమ్ టు కాజిల్ లొలిటా.... ఆన్ బిహాఫ్ ఆఫ్ డాక్టర్ మల్హోత్రా' – అంది.

తల ఓరగా వాల్చి థాంక్స్ చెప్పాడు రాజేష్.

"అరె ఖోలా.... సూట్‌కేస్ తీసుకెళ్ళి మేడపైన గెస్ట్‌వింగ్‌లో మూడవ గదిలో వుంచేయ్" – హిందీలో పురమాయించింది.

'రండి అంకుల్ రాజేష్.... నిలబడే పోయారు' అంటూ తను తప్పుకొని లోనికి దారి ఇచ్చింది.

'మిస్ సునీతా, డాక్టర్ మల్హోత్రా అవుపించడేం.... డిస్పెన్సరీ అంటూ ఎటైనా వెళ్ళాడా ?' అన్నాడు సోఫాలో కూర్చుంటూ.

'లేదంకుల్.... ఉదయమే పనుందని వెళ్ళిపోయారు. ఇప్పుడో ఇంకా స్సేపటికో తిరిగి రావచ్చు'.... అంది.

'డాక్టర్ షార్మా వచ్చాడా ?'

అంతలో పన్నెండేళ్ల పనివాడు నందు, టాయ్ ట్రే తెచ్చి సోఫా ప్రక్కన తగ్గు బల్ల మీదుంచి లోనికెళ్ళాడు.

'అంకుల్ షార్మాజీ ఇంకా రాలేదు.... ఒక్క నిమిషం... డ్రైవర్‌కు ఇన్స్

స్ట్రక్షన్స్ ఇచ్చి ఇప్పుడే వచ్చేస్తాను.... మీరీలోగా బాయ్ వుచ్చుకోండి అంకుల్....' అంది స్వచ్ఛమైన తెలుగులో.

విస్ఫారిత నేత్రాలతో ఆ బాలిక వంక చూచి 'బేబీ.... నీకు తెలుగు వచ్చా' అన్నాడు.

అతని కళ్ళలో మెరుపుకు కించిత్ సిగ్గుపడి వచ్చన్నట్టు తలూపింది.

'వెళ్ళిరా, సునీతా....' అన్నాడు.... రాజేష్.

టీ పాట్ మీది ఫ్లానెల్ టోపీ తీసి పొగలు సెగలు కక్కే బాయ్ అందించాడు నందూ.

కొద్ది కొద్దిగా సిప్ చేస్తూ.... ఇల్లంతా కళ్లతో సర్వే చేశాడు.... గోడలనిండా గిల్ట్ ఫ్రేములో పెద్ద పెద్ద ఆయిల్ పెయింటింగ్స్ పాతవాటి స్థానే క్రొత్తవి వేళ్ళాడుతున్నాయి. ఎత్తయిన కార్నర్ స్టూల్స్ మీద తళతళ మెరిసే ఇత్తడి కుండీలలో కాడలతో సహా కత్తిరించి పొందికగా అమర్చిన గులాబీలు.... డాలియాలు, క్రైసాంతమమ్స్ వున్నాయి.

కిటికీలకున్న పట్టు పరదాలు ప్రక్కకు లాగి వుండడంతో వెలుతురు హాలు నిండా పరచుకొని వుంది.

'కాజిల్ లొలిటా'లో.... ఎండ కాలాన్ని, చలికాలాన్ని తట్టుకోవడానికి సెంట్రలీ ఏర్ కండిషనింగ్, హీటింగ్ సిస్టమ్స్ అమర్చుకున్నాడు డాక్టర్ మల్హోత్రా. పెద్ద హాలు. వాల్ టు వాల్ కార్పెట్స్.... మెత్తని కుషన్ సోఫాలు, చిన్న చిన్న బల్లలు.... పెద్ద షేడ్స్ వున్న టేబుల్ లాంపులు.... అత్యాధునికమైన డిజిటల్ ఫోను. ఫోను కలుపుతూ అన్ని గదులకు ఎక్స్‌టెన్షన్ ఫోనులు.... డైనింగ్, కిచెన్, పెద్ద లైబ్రరీ కమ్ స్టడీ - మేడ పైకి వెళ్ళడానికి హాలు ప్రక్కగా మెట్లదారి.... మేడపైన నివాస గదులు. అన్ని గదులకు అటాచ్‌డ్ బాత్స్.... రన్నింగ్ హాట్ అండ్ కోల్డ్ వాటర్ సదుపాయం.

పిల్లలిద్దరూ విదేశాల్లో చదువుకొంటూండంతో, శ్రీమతి చందనా మల్హోత్రా తరచూ విదేశాల్లోనే వుండిపోయేది.... ఒకవేళ మిసెస్ మల్హోత్రా ఇంట్లోవున్నా, ఇల్లు నడిచేది నౌకర్లు చాకర్లు మీదనే.... ఇంటి వ్యవహారాల్లో ఏనాడు జోక్యం కల్గించుకునేది కాదు.

"సారీ, అంకుల్.... మామయ్యా ఈపాటికి రావల్సింది! ఆలస్యమైనట్టుంది.... మీరు బ్రేక్‌ఫాస్ట్ తీసుకొని స్నానం చేస్తారా? స్నానం చేసి ... బ్రేక్‌ఫాస్ట్ తీసుకుంటారా?" అంటూ ఎదుటి సోఫాలో కూర్చుంది సునీత.

చిరునవ్వుతో సునీత వైపు చూచి .... "మల్హోత్రా రానీయమ్మా.... ఈలోగా స్నానం పూర్తి చేసుకొని వస్తాను" అన్నాడు.

సోగకళ్లు.... విల్లులాంటి నల్లని కనుబొమలు.... రెప్పల పైభాగాన ఐషాడో .... కళ్ళకు మస్కారా.... పొడవైన లాషెస్.... ఎత్తయిన చెక్కిళ్ళకు

లైటుగా అద్దిన రూజ్.... వొంపులు తిరిగిన పెదిమెలకు మాయిశ్చరైజర్ తో కూడిన లైట్ లిప్‌స్టిక్.... ఎత్తయిన వక్షోజాలు.... గుండ్రని భుజాలు .... శంకులాంటి మెడలోంచి జలపాతంలా వేలాడే సన్నని పొడవాటి చైన్.... పసిమి కలిసిన తెల్లని శరీర ఛాయలో.... సర్వసాధారణ ఎత్తు, ఎత్తుకు తగ్గ లావులో .... మాట మన్నన కలిగిన సునీతను చూస్తూంటే .... విధాత మంచి మూడ్‌లో వుండగా చెక్కిన బొమ్మలా వుందనిపించింది....

"అంకుల్ రాజేష్. మామయ్యలాగే మీరుకూడా కూర్చునే కలలుకంటారా ?" నవ్వుతూ చురక అంటించింది. తెల్లని పలువరుస తళుక్కుమంది.

"ఆ.... ఆ...." అంటూ లేచి నుంచుని,.... సునీత వెంటరాగా తన గదికేసి నడిచాడు రాజేష్.

రాజేష్.... ఎప్పుడు కేజిల్ లొలిటాకు వచ్చినా.... అతని మకాము ఒకటవ నెంబరు గదిలోనే. ఆ ప్రక్క గదిలో డాక్టర్ షార్మాకు.... మధ్యలో ఫేమిలీ మెంబర్లకోసం కేటాయించిన గదులు.... చివరి వింగ్‌లో మిస్టర్ అండ్ మిసెస్ మల్హోత్రాల గదులు....

పేరుకు గదులైనా .... ఫుల్లీ ఫర్నిష్‌డ్‌అపార్ట్‌మెంట్స్....

గుమ్మంవద ఆగిపోయింది సునీత...

"థాంక్యూ బేబీ.... ఓ అరగంటలో వచ్చేస్తాను" అంటూ లోనికెళ్ళాడు. తలుపు నెమ్మదిగా మూసుకుంది.

షేవింగ్, షవర్ అయాక,.... టీ షర్టు. ఉలిన్ పాంటు ధరించి.... నీటుగా ముస్తాబై.... ఓమారు అద్దంలో అటూ ఇటూ చూచుకున్నాడు. నవలల్లోని అందమైన... నాయకుడిలా ... ఎత్తుగా... బక్కపలచగా.... యువకుడిలా వున్నాడు.... చెంపల దగ్గర తెల్లబడిపోయిన వెంట్రుకలను .... ఓ మారు చేత్తో తడుముకొని.... ఆవులింత నాపుకొంటూ.... ప్రక్కనే వున్న మెగజైను నొకదాన్ని అందుకొని.... రాకింగ్ ఛేర్‌లో.... రిలాక్స్ అయ్యాడు.... రాజేష్.

✠ ✠ ✠

తలుపుమీద టకటకలు .... కారిడర్‌లో అడుగుల చప్పుడుకు మెళకువ వచ్చింది రాజేష్‌కు.

"సారీ, బేబీ ! నిద్రపట్టేసింది" అన్నాడు. ఎదురుగా డాక్టర్ మల్హోత్రా నిలబడి వున్నాడు....

"అరె యార్ !" .... అంటూ మిత్రుణ్ణి కౌగలించుకున్నాడు.

ఒకరి చేతుల్లో ఒకరు యిమిడి "హౌ ఆర్యూ అంటే హౌ ఆర్యూ" అని ఆప్యాయంగా పలుకరించు కున్నారు.

అంతలోనే మోచేతి దూరంలో మిత్రుణ్ణి నుంచోబెట్టి "హౌ కమ్.... యు ఆర్ స్లీపింగ్ ఎట్ దిస్ అవర్.... నీకోసం ఎదురు చూస్తోంది. సునీత తెలుసా ?".... అన్నాడు మల్హోత్రా

(ఇంకా వుంది

